భేదంబులవలనను నన్నియుఁ బ్రత్యేకంబుగాఁ గూడుకొని మున్నూట యిరువది నాలుగు మండలంబుల పర్యంతంబు గలిగిన మండల భేదంబులు బహుప్రకారంబులుగా బహుముఖం బులవారలు పలుకుచుందు రయినను సకలమతసమ్మతంబును సకల లోకప్రసిద్ధంబును సకలలోక విజ్ఞాతంబునైన యది యీ ద్వాదశ రాజమండలంబే యగు నదియెట్లనిన. 12

## ద్వాదశరాజ మండలము

సీ॥ అరియును మిత్రుండు నరిమిత్రుఁ డన్వల
  నహిత మిత్రామిత్రుఁ డహితమిత్ర
మిత్రుండు ననఁగ భూమిపతులైదుగు
  రల విజిగీషువు నగ్రమునను
వెనుకఁ బార్ష్ణిగ్రాహుఁ డనియెడు నాతండు
  నాక్రందుఁ డనురాజు నవలి వంక
యుండుఁ బార్ష్ణిగ్రాహకాసారుఁ డాక్రంద
  కాసారుఁడన నల్వు రవనినాథు

గీ॥ లరివిజిగీషులభూములయంతనుండు
మధ్యముఁడు వారిచెంతను మనుపఁ గట్టి
చనునుదాసీనుఁ డన్నిట ఘనుఁడు దీనిఁ
దెలియద్వాదశ రాజమండల మటంద్రు॥ 13

గీ॥ మఱియు మిత్రుఁ డుదాసీన మనుజపతియు
నరియునన నింతమాత్రమే యగుచు నుండు
మండలము పతి కీరితి మండలంబు
నొరిది గెలుచుటె మండలశుద్ధియండ్రు॥ 14

శ్లో॥ అష్టశాఖం చతుర్మూలం షష్టిపత్రం ద్వయేస్థితం।
షట్పుష్పం త్రిఫలంవృక్షం యోజానాతి స నీతివిత్ ॥

గీ॥ ఆరు లర్వదియును విరు లాఱు కొమ్మ
లెనిమిదియు మూఁడుఫలములు నునికి రెంటి
యందు వేరులు నాలుగు నమరు ద్రుమము
నెఱుఁగు వాఁడిట్టి నయగతి నెఱుఁగువాఁడు ॥ 15

వ॥ ఇందలి యభిప్రాయము 16

సీ॥ అరివిజిగీషువు లిరువురి కగు మిత్రు
లెనమంత్రు లను శాఖ లెనిమిదియును
మధ్యమోదాసీన మానవేంద్రులు నరి
విజిగీషువును నన వ్రేళ్ళు నాల్గు
మహిని ద్వాదశరాజ మండలమున రెన్ని
సై దేశి ప్రకృతుల నమరఁ గూడ
విషయ నర్వది మండలము లగు నదియును
షష్టిపత్రంబులు షడ్గుణములు

గీ॥ ననెడి విరులు నయానయ యత్నయుగళి
నెపుడు నునికి క్షయస్థానవృద్ధులనఁగ
నలరు త్రిఫలంబులును గలయట్టి ద్రుమము
నెఱుఁగు వాఁడిట్టి నయగతి నెఱుఁగువాఁడు ॥ 17

వ॥ ఇందుకు మఱియొక పద్యము.

సీ॥ గనులును గృహులాదిగాఁ గలయష్టవ
ర్గంబనునట్టి శాఖలును గల్గి
సామంబు మొదలైన చతురుపాయము లనఁ
బొలుపొందునట్టి వేరులును గల్గి

యల విజిగీషుమండలమున కై చేసి
ప్రకృతులతో నెనుబదియు నవియు
రమణ సర్వాది మండలము లగు నవియును
షష్టి పత్రమ్ములు షడ్గుణములు

గీ॥ ననెడి విరులు నయానయ యత్నయుగళి
నెపుడు సునికి క్షయస్థానవృద్ధు లనఁగ
నలరు త్రిఫలంబులును గల యట్టి ద్రుమాసు
నెఱుఁగువాఁ డిట్టి నయగతి నెఱుఁగువాఁడు॥ 18

వ॥ కావున నందు నీ చెప్పిన ద్వాదశరాజమండలంబుల యుద్ధ
క్రమంబుఁ గ్రమంబున వివరించెద. 19

మండలచరిత ప్రకరణము

సీ॥ అలవిజిగీషుపై నట్టి రాజునకును
వెనుకఁ బార్ష్ణిగ్రాహుఁ డనెడి రాజు
నవలఁ బార్ష్ణిగ్రాహకాసారుఁడను రాజు
శత్రువు లగుదు రీజగతిలోన
నాక్రందుఁడను రాజు నాక్రందకాసారుఁ
డను రాజు మిత్రులై యొనరుచుంద్రు
కావున నచ్చోటఁ గలిగిన మిత్రభూ
వరులచే శత్రుభూవరుల కెపుడు

గీ॥ గదలఁగా రాక యుండఁ బో రొదవఁ జేసి
తనకు ముందరఁ గల్గు శాత్రవుల మీఁద
దండు గదలంగపలయు నుద్దండలీల
వినుతి కెక్కుచు జయముఁ జేకొనెడికొఱకు॥ 20

సీ॥ అతులనే విజిగీషుపై నట్టి భూపతి
రసికుఁడై నీతిమార్గంబు మెఱసి
తన శత్రుమీఁదటఁ దన మిత్రభూపతి
తన శత్రుమిత్రుపైఁ దనదుమిత్ర
మిత్రుఁడై నట్టి భూమిపతిఁ గవియింప
నను వారి కందఱ కవలనుండఁ
దనయరిమిత్రమిత్రుని గదలకయుండ
నటఁగృతకృత్యుఁడై యధికుఁడైన

గీ॥ యుభయమిత్రుల రేఁచి పోరాదవఁ జేసి
తనకుఁ బిమ్మటఁగల్గు శాత్రవులమీఁద
నండు గదలంగ వలయు నుద్దండలీల
వినుతి కెక్కుచు జయముఁ జేకొనెడి కోఱకు॥ 21

వ॥ మఱియు నిట్టి విజిగీషువగు రాజు దనమిత్రుండును దాను నిట్ట
రిద్దరుఁ గూడి యెడనెడనయుండెడి తన శత్రువుల నిరుదిక్కు
లను జిక్కించక యుక్కడంచి జయించి మించు తెఱంగు
వివరించెద. 22

సీ॥ తానును నాక్రందధాటణీపతియుఁ బా
ర్ష్ణిగ్రాహు నొవ్వఁగాఁ జేయవలయు
నాక్రందు నాక్రందనాసారు వనికంపి
పార్ష్ణిగ్రహాసారుఁ బఱుపవలయుఁ
దనము మిత్రుండును దానుఁ గూడుక తన
యరిరాజుఁ బెకలించి చెఱుపవలయుఁ
దనమిత్రుచేతను దనమిత్రమిత్రుచేఁ
దనయరిమిత్రునిఁ దఱుమవలయు

ఆ॥వె॥ ఉభయమిత్రుచేత నొగి మిత్రమిత్రుచే
శత్రుమిత్రమిత్రుఁ జయింపవలయు,
నిటుల సహితవరుల నిడుగడ గదుముచు
గెలువవలయు నల జిగీషువనకు ॥ 23

కం॥ ఈరీతి రెండుగడలన్
నేరుపుతో గెలువఁగోరు నృపతి గదియుచున్
వైరులు మెత్తురు, లేదా
వారు చనుంగొలిచి నిలిచి వర్తింతు రిలన్ ॥ 24

చం॥ తనకును వైరికిన్ సమతఁదాల్చిన చుట్టవుపంకవారి నే
యనువునవైనఁ గూర్చుకొని యందఱినిం దనవారిఁజేసికోఁ
జను నటులైన చుట్టములె చాల నలంచినయట్టిశత్రునిన్
జనపతి వా జయించుటకుఁ జాలఁగ శక్తుఁడగున్ సుఖస్థితిన్ ॥

ఆ॥వె॥ కారణములచేతఁ గాదె లోకులు శత్రు
లగుచు నున్కి మిత్రు లగుచు నున్కి
యటులు గాన శత్రు లయ్యెడికారణం
బులను విడువవలయుఁ బుడమిఱేఁడు ॥ 26

కం॥ దొర తాఁ బ్రధాన మగుచున్
ధరఁగలిగిన ప్రజలనెల్లఁ దనవారలుగా
బరగింపందగు నటువలెఁ
బరగిన సర్వాంగరాజ్యపదవిం జెందున్ ॥ 27

ఉ॥ దూరమునందె యుండి పరదుర్గనివాసుల నంతరేశులన్
గూరిమిఁ జూపి మిత్రులుగఁ గూర్చుకొనందగు నట్లొనర్చినన్
వారలు ప్రాణబంధువులు వశ్యులునై వినయంబు పెంపునన్
దారె యొనర్పుచుందురుర తక్కిన మండలముల్ వశంబుగన్॥

చం॥ పటుబలుఁడైన మధ్యముఁడు పైఁదగ పెండొస గూడి పెచ్చిసన్
గటిలత మాని తాను నరికూటువఁ గూడుచునుండు టొప్పఁ దా
నటువలె శక్తుఁడై నిలుచునంతటి పూనిక నూనకుండుచోఁ
దటుకున సంధిసేయఁదగు దానవిధాస నిదానలీలలన్ ॥ 29

గీ॥ అధికుఁడైన యుదాసీసుఁ డదరినపుడు
సకలమండలనాథులు నొకటి యగుచు
సంఘధర్మంబుమై నుండఁ జనునపుడును
బలిమిలేకున్న శరణొంది బ్రతుకవలయు ॥ 30

సంఘధర్మ స్వరూపము

కం॥ ఘనముగ నాపద లొదవిన
జనపతు లందఱును గూడి స్వార్థముకొఱకై
యొనఁగూడి యవి యడంచుట
యనుపమగతి సంఘధర్మ మనఁగాఁ బరగున్ ॥ 31

శత్రుమండలమును గుఱించిన వైశేషికవర్తనప్రకారము

కం॥ సహజుఁడు కార్యజుఁడనగా
మహి నిరువురె శత్రులరయ మానవపతికిన్
సహజుఁడు దాయాదుండౌ
సహితుఁడు కార్యజుఁడు వాని యస్యుండెంచన్ ॥ 32

గీ॥ అరియెడఁ జరింపవలసిన యట్టి నడక
లయ్యె నాలుగు నుచ్ఛేద మపచయంబు
గాలమునఁ జేయు పీడన కర్శనంబు
లనుచు నయవిద్య లెఱుఁగువారండ్రు ధరను ॥ 33

వ॥ అదియె ట్లనిన. 34

సీ॥ ప్రకృతుల నన్నింటిఁ బరిమార్చుట దలంప
  నదియుఁ దా నుచ్ఛేద మనఁగఁ బరగు
బలిమి భండారంబు గలిమి రిక్తఁగఁ జేయు
  నదియుఁ దా నపచయం బనఁగఁ బరగు
నరపు మహామాత్యసంహార మొనరింప
  నది కర్శనం బని యనఁగఁ బరగు
దుర్గరాష్ట్రాదులఁ దొడరి ఖండించుట
  యది పీడనం బని యనఁగఁ బరగు

గీ॥ నిట్టి నాలుగు తెఱఁగులు నెఱిఁగి యరుల
యందుఁగావింప నేర్చిన యట్టి ఘనుఁడు
సకల ధాత్రీతలంబును బ్రకట లీల
నేలువైరుల నెల్ల జయించి మించు॥ 35

గీ॥ ఆశ్రయవిహీనుఁడై యుండి యడరెనేని
హీనబలుఁ డగుపతి నాశ్రయించెనేని
యెందుఁ బలుపురితో వైర మందెనేని
యపుడు భూపతి గడి శత్రు నడపవలయు॥ 36

ఉ॥ ఎందు సమాశ్రయం బనుచు నెంతురు దుర్గము మిత్రు నీసతోఁ
జెంది మహాభిమానమును జెందిన శత్రుని వేళయందె చే
టందగఁ జేయఁగావలయు నాతనిఁగొల్చు నమాత్యుఁజంపియుం
గ్రందగు రాష్ట్ర దుర్గముల రాయిడిచేఁ గడుఁ బీడచేసియున్॥

కం॥ తనమర్మము తన ఛిద్రము
దన విక్రమ మెఱిఁగి చెఱుచుఁ దనవాఁడగుచున్
దనరిన శత్రువు లోపల
మనికొందినయగ్ని యడ్డు మాత్రుంబోలెన్॥ 38

ఉ॥ మాటికి సర్వతంత్రముల మర్మముఁ దెల్పెడువాఁడు గల్గు నె
చ్చోటను శాత్రవుండనుచుఁ జొప్పడుఁ దొల్లి రఘూద్వహుండు దా
మేటి విభీషణుండు నలమిత్రసుతుండును గల్గఁ బట్టి యా
ప్పాటును లేక రావణునిఁ బట్టి వధింపఁడె వాలిఁ ద్రుంచఁడే॥ 39

సీ॥ బలవంతుతోడుతఁ గలహింపుచును దన
యరి ప్రయాసంబున నంది నప్పు
డతనిభండారంబు నతనిబలంబులఁ
జెఱుపఁగాఁ దగుఁ దనుఁ జెఱుపకుండ
నొకశాత్రవునిఁ బట్టి పెకలించి పైపై
నొక బలవద్వైరి యొదవెనేని
మునుపటి పగఱనే తనవానిఁగాఁ జేసి
కొని నేర్పుతోఁ గూడికొనఁగవలయు

గీ॥ కులమువారల తోడుతఁ గూడి బలియు
చుండఁ గోపి యుండువైరి నాతని కులంబు
వాని కొకశత్రుఁ గల్పించి వాని మిగులఁ
బెంపు సేయుచు విభుఁ డరి నొంపవలయు॥ 40

సీ॥ విసముచేతనె యొండు విసము నాశము నొందు
వజ్రంబుచేఁ దెగు వజ్ర మెపుడు
మీలు మీలనుబట్టి మ్రింగుచు నుండును
గరియును గరిచేతఁ గట్టువడును
దాయాదియును దన దాయాదిచేఁ జెడు
నటుగాన రావణు నడచు నప్పు
డల విభీషణుఁ బూజ నందించి పట్టె శ్రీ
రామచంద్రుండు గౌరవము జయము

గీ॥ ఇట్టి నయరీతి నెంతయు నెఱిఁగి నృపతి
వైరిఁ జెఱిపెడికొఱకునై వైరిపలుఁ
డైనవానినె పట్టి లా నాప్తుఁ జేసి
కొనుచు మెలపున జయముఁ గైకొనఁగవలయు ॥ 41

కం॥ ఏకార్యముఁ జేయంగాఁ
జేకొనఁ దన మండలంబె చెడుబా టగుఁ దా
నాకార్య ముడుగవలయుఁ
గైకొన్న ధరాతలంబుఁ గడు రంజిల్లన్ ॥ 42

కం॥ దానమున సామమున స
న్మానమున నెమ్మెలఁగఁ జేయఁదగుఁ దనవారిం
బూనుకొని భేదదండవి
ధానమ్ములచేతఁ బరులఁ దండింపఁ దగున్ ॥ 43

వ॥ ఇది శత్రుమండలప్రవర్తనప్రకారం బింక మిత్రమండలప్రవర్తన
ప్రకారంబు వివరించెద. 44

మిత్రమండల ప్రవర్తన ప్రకారము

కం॥ క్రమమున హితాహితుల లో
నము నిండుచునుండు నములు గలరే యిది ని
ర్క్రమమో 'సర్వస్స్వార్థం
సమీహతే' యనఁగఁ బరగు శాస్త్రము లెమ్మిన్ ॥ 45

గీ॥ భోగమంది వికారంబుఁ బొందెనేని
యెంచి చుట్టంబునైన నొప్పించవలయు
మిగులఁగ వికార మొందినఁ దెగి వధింప
వలయు నిలఁ బాపకర్మంపు వైరి గాన ॥ 46

కం॥ మిగుల నుపకారియైనను
బగవానిఁ మిత్త్రుఁగాఁగఁ బాటింపఁ దగునే
మిగుల నపకారియైనను
దగుఁ జుట్టమునైన విడుపఁ దగు జనపతికిన్ ॥ 47

కం॥ తనయెడఁ దనశత్త్రునియెడ
ననిశంబును బక్షపాతియై మెలఁగెడు మి
త్త్రునిఁ గూల్పవలయు నింద్రుఁడు
కినుకన్ మును విశ్వరూపుఁ గెడపిన మాడ్కిన్ ॥ 48

గీ॥ అహితునకు హిత మొనరించునట్టి మిత్త్రు
నైన విడువంగఁ దగుఁ దన యహితుమాడ్కి
హితుల పట్టున నెవ్వాఁడు హితము సేయు
వాఁడెపో మంచిమిత్త్రుఁ డిప్వసుధలోన ॥ 49

కం॥ అనురక్తుండు విరక్తుఁడు
ననవల దుపకారకారి యగుమిత్త్రునిఁ దా
ననువుగఁ దెలియుచు దోషం
బునఁ జెందినమిత్త్రు విడువ భూపతి కొనరున్ ॥ 50

కం॥ కడుదోనఁ గొందని మిత్త్రుని
విడిచినచో నర్థధర్మవితతియు నడఁగున్
బుడమిం గావునఁ బతి యె
ప్పుడు సద్గుణములను దోషములఁ దెలియఁ దగున్ ॥ 51

కం॥ తానె నిజంబుగ నేరమిఁ
గానక మఱియాజ్ఞసేయఁగాఁ దగ దేరం
దానే నేరమిఁ దెలిసిన
చో నుచితపు టాజ్ఞచేతఁ జొప్పడుఁ బతికిన్ ॥ 52

కం॥ నేరము లేవియుఁ బొరయని
వారిని దండించునట్టివసుధావిభుసిం
గ్రూర మగుపాముఁ జూచిన
తెరునఁ బ్రజలెల్లఁ జూచి తిట్టుదు రెపుడుꣳ॥ 53

కం॥ తగ నధికమధ్యమాధము
లగుమిత్రులతారతమ్య మరయఁగ నలయుꣳ
దగ నధికమధ్యమాధము
లగువారలపనియుఁ దెలియనగు నధిపతికిꣳ॥ 54

గీ॥ తెలియ కెవ్వరినైన నిందింపరాదు
లేనినిందలు గట్టెడువానిపలుకు
వగిలి వినరాదు మిత్రభేదములు పూని
సేయువారలఁ బతి చేరనీయరాదు॥ 55

కం॥ పాటించి తెలుప నోపని
మాటయు మచ్చరపుమాట మధ్యస్థంబౌ
మాటయును బక్షపాతపు
మాటయుఁ బతి లెస్సఁ దెలిసి మతి సేయఁదగుꣳ॥ 56

కం॥ తనచుట్టములకుఁ బోరాం
దినవొక్కనిఁ బట్టి వాదు నెఱపక వేగఁ
బున వారలలో వారికిఁ
గినుకలు మాన్పంగవలయు క్షితిపతి యెందుꣳ॥ 57

ఉ॥ కాలముపేర్మిఁ దా ఘనము గౌరవ మొందుచు నుండుఁ గానఁ ద
త్కాల మెఱుంగురాజు గుణకల్పన కొంత ఘటించి నీచునిꣳ
జాలఁగ సంస్తుతింపఁ దగు సారెకు నాతని దుర్గుణంబు లె
వ్వేళను గప్పి పెట్టుచు వివేకవిలోకనచాతురీగతిꣳ॥ 58

కం॥ తనవారినిఁ బెఱవారినిఁ
దనవారినె చేసికొనఁగఁ దగు జనపతి యెం
దును దా బహుమిత్రుం డై
నను వైరులు సెప్పినట్లు నడతురు పుడముఁన్ ॥ 59

కం॥ తన కాపద యగువేళను
దనమిత్రుండైన కరణిఁ దన బంధువులుం
దనతండ్రియుఁ దన యన్నలు
దనతమ్ములు హితముఁ జేయఁ దా రోపుదురే ॥ 60

కం॥ క్షితిలోపల నతులదృఢ
వ్రతులై తగుతనదుమిత్రవర్గముచేతన్
బ్రతివీరు లైనవారలఁ
జతురతమై నిగ్రహింప జనపతి కౌనరున్ ॥ 61

మ॥ ఇల నీరీతుల నీతిమార్గమునఁ దా నేత్రొద్దివర్తించి ని
శ్చలితోద్యోగమునన్ జయేచ్ఛ గలరాజన్యుండు నెంపొందు మం
డలశుద్ధిం దగి శుద్ధమండలమునన్ వర్తించు నాకారదో
జ్జ్వలచంద్రుం దన భూప్రజావితతికిన్ సంతోషముం జేయుచున్ ॥

వ॥ ఇది మండలశోధన ప్రకారంబు. ఇంక సంధ్యాది షడ్గుణంబుల
స్వరూపంబుఁ గ్రమంబున వివరించెద. 63

## సంధివికల్పప్రకరణము

కం॥ బలియుఁ డగువైరి గదిమిన
బలువగునాపదలఁ జెంది ప్రతి సేయఁగ నే
ర్పులు లేనిరాజు కాలం
బలవడఁ గడపుచును సంధి యమరించఁ దగున్ ॥ 64

వ॥ అదియు గొన్నిమతంబులవారు కపాలసంధి, యుపహారసంధి, సంతానసంధి, సంగతసంధి, యుపన్యాససంధి, ప్రతీకారసంధి, సంయోగసంధి, పురుషాంతరసంధి, యదృష్టనరసంధి, యాదిష్ట సంధి, యాత్మామిషసంధి, యుపగ్రహసంధి, పరిక్రియసంధి, యుచ్ఛిన్నసంధి, పరదూషణసంధి, స్కంధోపనేయసంధి, యనం బదునాఱు విధంబులుగాఁ బలుకుదురు. ఇవి కొన్నిమతంబుల వారు పరస్పరోపకారసంధియు, మైత్రసంధియు, సంబంధి సంధియు నుపహార సంధియు నన నాల్గు తెఱంగులే యని పల్కుచుందురైనను నిందులో నుపహారసంధి యొక్కటియు నీ కామందక మతంబునకు సమ్మతంబు. అది యెట్లనిన నెందును దనమీఁద దండెత్తివచ్చిన బలవంతుం డగుశాత్రవుఁ డెండైన నొకటిఁ గానుకఁ గొనక మగుడి చనండు కావున మైత్రిచేనైన సంధి యొక్కటి దక్క దక్కిన సంధు లన్నియు నియ్యుపహారసంధిలోని భేదంబులే యగు నైన నీపదియాఱు సంధుల స్వరూపంబుఁ గ్రమంబున వివరించెద. 65

॥ సమసంధియ కపాలసంధియై పొలుపొందు
　　నుపహార మీఁగిచే నొనరుచుండు
సంతానసంధి నాఁ జనుఁ గూఁతు నిచ్చినఁ
　　గడుమైత్రి నెనయ సంగతపుసంధి
కలకాల మది యొక్కగతిఁ బ్రవర్తింపుచు
　　సమకార్యములు గల్గి చాల మించి
యాపదలందును, నధికసంపదలందు
　　భేదంబు చెందక పెంపుఁ జెంది

గీ॥ యలమనుష్యముఖాంతర మందునై సఁ
గట్టి కొట్టుచుఁ గాఁకలం బెట్టునెడల
నది సువర్ణంబులీలచేఁ జెదర కుండుఁ
గనుక కాంచనసంధి నా వినుతిఁ గాంచు ॥ 66

సీ॥ మంచికార్యము నిద్ధతెంచి సేయుటకునై
యడరుట యది యుపన్యాససంధి
యితనికి నుపకార మే నొనర్చితి మున్ను
నతఁడు నా కుపకార మటులఁ జేయు
నుపకార మిపుడు నే నొనరించుచున్నాఁడ
నిఁకమీఁద నా కుపకృతి యొనర్చు
గలఁ డితడని రాముఁ డెలమి సుగ్రీవున
కొనరించినట్టుగా నొప్పు నిదియు

గీ॥ ననెడు నదియును బ్రతికార మనెడిసంధి
యిరువు రొకయాత్రఁ గూర్చి తా రింపుమీఱ
సంధి సేయుట సంయోగసంధి యనఁగఁ
బరగు నీరీతు లెఱుఁగ భూపతికిఁ దగును ॥ 67

సీ॥ మనయిరువుర యోధులును గూడి మాకార్య
మిది యొనగూర్చిన నింత ధనము
మీ కిత్తుమని తాను మేకొన్న సంధి తా
నది పురుషాంతర మనెడుసంధి
మాకార్య మిది మీర చేకూర్చినను మీకు
నిట్టివస్తువులు మే మిత్తు మనిన
నది యదృష్టపురుషమనఁ దనరెడు సంధి
దేశాంశ మియ్య నాదిష్టసంధి

గీ॥ తనదు సైన్యంబుచేతనే తగ నొనర్చు
సంధి యాత్మామిషం బనుసంధి యండ్రు
ప్రాణరక్షణమునకు సర్వంబు నొసఁగి
కలసియుండుట యది యుపగ్రహ మటండ్రు ॥ ౪౮

సీ॥ భండారమం దొకపా లిచ్చి యైన నం
దిచ్చదాఁకినసొమ్ము లిచ్చియైనఁ
బసదుభండార మంతయు నిచ్చియైనను
సంధించి ప్రకృతిరక్షణ మొనర్ప
నది పరిక్రియసంధి యనఁ జెలువొందును
దనభూమిమే లెంచి తనపగఱకు
నొనగూడి యిచ్చిన నుచ్ఛిన్నసంధి యోఁ
దద్భూమి ఫల మింత ధన మటంచు

గీ॥ నమర నిచ్చిన ఫలదూషణాఖ్యసంధి
ఫలమె విభజించి కందాయముల నొసంగ
నిర్ణయించుట స్కంధోపనేయసంధి
యిట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ ౪౯

సీ॥ బాలుండు వృద్ధుండు బహుదీర్ఘరోగుండు
నిజబంధుదాయాదనిందితుండు
పిఱికి యైనయతండు పిఱికిబంటై యుండు
పిఱికిబంట్ల యతండు పిసిడివాఁడు
విరసరాజ్యాంగుఁడు విషయాసక్తుండను
బహుచిత్తమంత్రుండు బహువిరోధి
గురువులు వ్యసనముల్ గలిగినయతఁడును
వ్యసనముల్ గలుగుసైన్యములవాఁడు

ఆ॥ దైవహతుఁడు సత్య ధర్మహీనుఁడు లోభి
విడిచినతఁడు సురల ద్విజుల నెపుడు
గడవ నాడువాఁ డకాలయోధియు దైవ
చింతకుండు సంధి సేయఁ దగరు॥ 70

వ॥ అది యెట్లనిన నిట్టియిరువది తెఱంగులవారును సంధానార్హులు గాకుండుటకుం గారణంబులు గలవు వివరించెద. 71

సీ॥ బాలుండెదురుగాఁగఁ జాలనికతమున
పని సేయఁగాఁ బూన రతనిబంట్లు
తానును పని సేయ లేనివానికి సుప
కారార్థ మెవ్వండు పోరానర్చు
ముసలివాఁడును రోగములు గల్గువాఁడు ను
త్సాహశక్తులులేమి తమజనంబు
చేతనే భంగంబుఁ జెందుదు రెందును
విరసుఁడై జ్ఞాతుల విడచినయతఁ

గీ॥ డరికిఁ గైవసమై యుండు నట్టిజ్ఞాతి
జనులచేతనె మున్నుగాఁ జంపఁబడును
గాన వీరెల్ల సుఖసాధ్యులైనవార
లిట్టివారలతో సంధి నెనయరాదు॥

సీ॥ కోఁచవాఁ డని సేయఁ గోఱఁగానికతమునఁ
దనుఁ దానె వెఱచి నాశనముఁ జెందు
కడుఁగోఁచబంటులఁ గలధీరుఁడైన స్వా
బంట్లచే నాజి విప్పాటుఁ బొరయు

నరిచేత లంచంబు లంది పిచ్చతనంపు
బంటులు పతిఁ గీడుపఱతు రెపుడు
లోభి జీతము లీయ లొంగెడుకతమున
బంటులు మొగియరు బవరమునకు

గీ॥ విరసరాజ్యాంగుఁ డరులతోఁ దురమొనర్ప
విసివి రాజ్యాంగములు వాని విడిచి పెట్టు
విషయసక్తుని గడు సుఖవృత్తి గెలువ
వచ్చుఁ గావున వీరితో వలదు సంధి ॥ 73

సీ॥ బహువిచారంబులు బహుచిత్తములు గల్గు
పతిమంత్రులకు నెల్లఁ బగతుఁ డగుచు
చలచిత్తమందుటవలనఁ గార్యంబుల
యెడ వారిచేతనే విడువఁ బడును
పెక్కుదేగలయందుఁ జిక్కుపావుర మన
బహువైరి యగువాఁడు పదరి బెదరి
యెట్టిత్రోవలఁ బోవు నట్టిత్రోవలయందె
క్రుక్కి శాత్రవులచేఁ జిక్కువడును

గీ॥ కరువు వ్యసనంబులును జెంది కలఁగువాఁడు
కోలుకోలేక తనుఁ దానె కూలుచుండుఁ
గాన వీరెల్ల సుఖసాధ్యులైనవార
లిట్టివారలతో సంధి నెనయరాదు ॥ 74

సీ॥ వ్యసనముల్ గలిగినయట్టిబలంబులు
గలవాఁడు పోటు కెక్కంగ లేఁడు
దైవోపహతకుఁడు తనుఁ దానె చెడుచుండు
సత్యంబు ధర్మంబు సడలినయతఁ

తనువుగా సంధి గైకొనినమీఁదట సైనెఁ
బదరుచుఁ దా మల్లబడి కలంగఁ
దలము దప్పినయట్టి దంతావళము సేటఁ
గొంచెపుమొసలిచే గుదిసినట్లు
గీ॥ నెలవు దప్పినయాతండు సలఁగి శత్రు
శాత్రవునిచేతనైనను సమయుచుండుఁ
గాన వీరెల్ల సుఖసాధ్యులైనవార
లిట్టివారలతో సంధి నెనయరాదు ॥ 75

సీ॥ దేవళ్ళఁ బాపలఁ దిట్టునాతఁడు ధర్మ
హీనుండు గావున నీల్గుచుండుఁ
గనుఁగొనలేక చీఁకటిలోనఁ గాకంబు
ఘూకంబుచేతను గూలినట్లు
కాల మెఱుంగక కలహించునాతండు
గాలజ్ఞయోధచేఁ గూలుచుండు
నాపదలకు మఱి యధికసంపదలకు
దైవంబె కద నిమిత్తం బటంచు
గీ॥ దైవచింతకుం డన్ని యత్నములు మాని
యూరకుండియు చెడుచుండు నుర్విలోనఁ
గాన వీరలతో సంధి గాదు తలఁప
నిట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 76

సంధి కర్హు లగువారు

గీ॥ ఆర్యుఁడును ధార్మికుండు ననార్యుఁ డధిక
బలుఁడు దాయాదవర్గంబు గలుగునతఁడు
సత్యవంతుండు బహుజయశాలి సంధి
కర్హులని పల్కు జీంద్రుఁ డయజ్ఞ శేఖరుఁడు ॥ 77

వ॥ అని యెఱ్ఱఁగిన, నిట్లు సంధానార్హులైన యేడుగురి తెఱంగును
గ్రహంబున వివరించెద. 78

సీ॥ ఆర్యుఁడై తగువాఁడు ప్రాణబాధలయందుఁ
దననుంచితనమె వదలకయుండు
ధార్మికుండెంతయు దనధర్మమహిమచేఁ
గడుఁ బ్రజారాగంబు గలుగుకతన
నతఁడెదిరించిన నతనికై యందఱు
నని యొనర్తురు కాన నతఁడసాధ్యుఁ
డగు ననార్యుండైన యతఁడు గూడకయున్న
నతఁడు శత్రులఁగూడి యడఁగఁజేయు

గీ॥ మొదలు ముట్టంగఁ బరఁగురాముని విధమున
నిట్టివార లసాధ్యులౌ టెఱింగి యందు
సంధి గావించవలయు నీ సంగతిలోన
నీతిమార్గం బెఱింగిన నృపవరుండు ॥ 79

సీ॥ అధికుఁడెంతయు నప్పు నాక్రమించినచోట
నెన్నియత్నంబుల నెనసియైన
నతఁడు దా బలుసింహమాక్రమించినలేఁడి
లీల నెందును దిక్కులేకయుండు
నధికుతో నేమాత్రమైనను గినిసిన
నప్పుండు మొదలంట నపుడె చెడును
బలవంతుతోఁ బోరఁ గలహించుమని నీతి
శాస్త్రంబు బలుకదు చెప్పఁబడుటలేదు

గీ॥ మొనసి పెనుగాలి కెదురని మొగిలు కరణి
నధికుతో నప్పుఁడెదురలేఁ డటులఁగాన

ప్రతుకవలసిన భూపతి బలియుతోడ
సంధిసేయంగవలయు నిశ్చయముగాఁగ ॥ 80

ఆ॥వె॥ అధికుఁడైనర ప్రముఁడై వేళ్యయైనచో
విక్రమించునట్టివిభునిసిరులు
చెందివెలయు గట్టుచెంతఁనప్రుతిఁజెంది
యాలఁ బ్రబలునటులయంది యుంది ॥ 81

సీ॥ దాయాదవర్గంబు చనకుగల్గినవాఁడు
కడుమూఁకఁజెందిన కారణమున
భేదింపరాకుండుఁ బెనుముండ్లు బలసిన
వెదురులపొదలోని వెదురుమూడ్కి
సత్యవంతుఁడు దన సత్యంబు నడుపుచు
సంధికృత్యంబుల జారకుండు
గెలుపువెయ్యేడఁ బెక్కుగలవాఁడు చౌరకైనా
పరశురామునిఁ బ్రతాపమునఁ బోలి

గీ॥ యతనిశౌర్యంబుచేతనే యఖిలదిశల
మించుభూపతులెల్లఁగంపించియుండు
రిట్టివార లసాధ్యులౌ చెటిఁగి విభుఁడు
సంధిసేయంగవలయు నీజగతిలోన ॥ 82

కం పెక్కు జయంబులు గల దొర
నొక్కటిగా సంధిగూడు నుర్వీ విభునిం
దిక్కని గొల్తురు వైరులు
చక్కనగాఁ దత్ప్రతాప సంతాపితులై ॥ 83

ఆ॥వె॥ సంధియయ్యెననుచు సత్యవంతులనైన
నమ్మియుండఁ జనదునరవరునకుఁ

జేయరానిబాస సేసియు నింద్రుండు
వృత్రుఁ జంపినట్టి విధమెఱింగి ॥ 84

ఆ॥వె॥ తనయుఁడైన నసుఁగు దండ్రియైనను రాజ్య
మంది యొకవిచార మొందుఁ గాన
లోకజనముచర్యలోనిది గాకుంట
ధరణిపతులనడకఁ దలఁప వలయు ॥ 85

కం॥ బలవంతుఁ డెత్తివచ్చిన
నలుకక దుర్గమున నిల్చి యంతటికంటెన్
బలవంతుఁదెచ్చి తఱుమఁగ
వలయుఁ బటాపంచముగ నవారితశక్తిన్ ॥ 86

వ॥ మఱియు భరద్వాజమతంబున. 87

కం॥ తనయుత్సాహము బలిమియుఁ
గనుఁగొని యరిమీఁద నెఱికి కలహింపఁ దగున్
ఘనసింహ మెదిరి పదకరు
లను వెంటాడంగఁ జూసులాగున నెందున్ ॥ 88

కం॥ ఉదుటుగల సింహ మొక్కటి
మదగజ సంఘములఁ గెల్చుమాడ్కిఁ బగఱపైఁ
బొదలిన తనయుత్సాహము
నుదుటుం గని గమకముసన నుఱుకఁగవలయున్ ॥ 89

కం॥ రడునల్పసైన్యసైనను
బడలికఁ బడి యొక్కశత్రు భంజించినచోఁ
బొడవైనశత్రుప్రతాపము
కడిమినె యిల నితరశత్రుగణముం బొగడున్ ॥ 90

కం॥ సముతోడ నైనసంధియు
నమరుం గెలుపోటమియును ననిలో సందే
హముగన నిట్లనె పలుకఁడె
యమరగురుఁడు నిశ్చితార్థ మది కాదంచుఁ ॥ 91

చం॥ బలియఁగఁ గోరురాజు సమబల్మికి మున్ను సమానవైరితోఁ
జలమునఁబోరఁగాఁ జనకసంధియె చేయుట మేలు కానిచో
నలవడఁ బచ్చికుండ మెరయంబడి రెండుగ వ్రీలునట్లు వడిఁ
బొలియుటె కాక గెల్పులను బొందుట లెందును జెందనేర్చునే॥

ఆ॥వె॥ సముల మనుచు బదరి సంధిసేయక మీఱి
పోరి యిరువురొకట బొలియరైరె
పందలైనయట్టి సుందోపసుందులు
గాన సములు సంధిఁ బూన మేలు ॥ 93

ఆ॥వె॥ తనకు వ్యసనమైనతఱి హీనుఁడెత్తిన
సంధిసేయఁడేని చాలఁగీడు
తడిసినట్టివానియొడలిపై నొకమంచు
బొట్టుబడిన వడఁకు పుట్టునట్లు ॥ 94

కం॥ హీనుఁడగు వైరి యొకలం
దా నెంతయు వ్యసన మెదవుతఱి సంధియును
న్మానుచు నిర్దయుఁడై పతి
వానియవిశ్వాస మెఱిఁగి వధియింపఁదగున్॥ 95

సీ॥ అరి కడుబలవంతుఁడైన సంధియుఁ జేసి
చేరి విశ్వాసంబుఁ జెంద నడచి
తాను నమ్మినయట్టివానికై వడి నుండి
తనయింగితాకృతుల్ గనఁగనీక

తనుప్రియంబులె పల్కి తనను శౌర్యము తన
కనుపైనవేళ సేయంగ వలయు
నదియటులన్న నట్లనుసరింపుచుఁ దొల్లి
విశ్వాస మందించి వేళయెఱిఁగి

గీ॥ ఘనుఁడు దేవేంద్రుఁడుం దితి కడుపుఁజొచ్చి
కడుపులోనున్న పగఱ వ్రక్కలుగఁ జీఱి
యల మరుద్గణకర్తయై యతిశయిల్లె
నిట్టిమార్గంబు నరపరుఁ డెఱుఁగవలయు ॥ 96

సీ॥ బలవంతుఁడగురాజు చలమునఁ బైనెత్త
నాతనియువరాజు నతనిమంత్రి
తోనైనఁ దాను సంధానంబు గావించి
వారిలో వారికిఁ బోరుఁబెట్టి
యదియును గాకున్న నతనిప్రధానున
కెంతయుఁ దా ధనమిచ్చియైన
వలయు నర్థముల లేఖల నిచ్చి యైనను
బరునియత్నంబులు నెఱుపవలయు

గీ॥ నిన్నిరీతులఁగార్యంబు లెసఁగకుండఁ
జేయఁ గడుసమర్థుఁడై పైరిచెంతనుండు
వారిపైనెల్లను గడువిశ్వాస మొందె
యతఁడు సేసిన యత్నంబు లతఁడెమాను ॥ 97

కం॥ అరియత్నము లుడుపఁగఁ దగు
నరిమిత్రుల సంధిసేసియైనను లేదా
యరివైద్యుల భేదింపుచు
నరిఁ జెఱుపఁగవలయు రసవిషాదులనైనన్ ॥ 98

వ॥ ఇట్టి యత్నంబులు చేసినను బెట్టిదుండగునట్టిపగఱ మట్టుఁ బడక ఖిట్టు గదిమినయేని వెండియు, 99

సీ॥ బహువేషభాషలఁ బరగినవారలై
యాభిచారికనిమిత్తాదు లెఱిఁగి
యాశత్రుదేశంబు నందె కాపుర ముండి
సంచరించెడుఁ జనచరులచేత
నొకకొన్ని ప్రశ్నలు నొకకొన్నిశకునముల్
కడు నిదర్శనములుగాఁగఁ దెలుపఁ
జేసి శత్రుల విశ్వసింపఁ గావింపుచు
వారిచేతనె బహువ్యసనములను

గీ॥ భీకరోత్పాతములును గల్పింపఁజేసి
యిట్లు శత్రునియుత్సాహమెల్లఁ దెఱచి
వానిఁ దోఁచెలుపుటను నవార్యమహిమ
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 100

గీ॥ పుత్రమిత్రకళత్రాప్తపరివృత్త
వాహనాదులు గడునంబువులని యొక్క
నిమిషమున వ్యర్థమగుట లో నృపతి యెఱిఁగి
మిగులఁ గలహంబులకుఁ బూని మెలఁగరాదు ॥ 101

కం॥ బలమును ధనమును జుట్టం
బులు నిజదేహంబు రాజ్యమునఁగీర్తితతుల్
దలఁకుచు సంశయదోలా
కలితముగాఁగనె వివేకి కదనమొనర్పఁగా ॥ 102

సీ॥ తనసరిదొరయైనఁదనమీఁద నెందెత్తి
తనతోడ సంధిగై కొనకయున్నఁ
దా నటమీఁద నాతనితోడ సంధి గా
వలసినవాఁడైయె వైర ముడిగి

కాలోచితంబైన క్రమమున సామదా
నంబులచేత భేదంబుచేత
నటు మట్టుఁ నడనుండి యామీఁదఁదా మించి
యరి కసాధ్యంబైనయచట నిలిచి

గీ॥ చతురగతిఁ బొల్చు సన్నాహసహితసైన్య
పటలిచేతను జీకాకుపఱుపవలయు
నతఁడెటులఁ దప్పుఁడై కూడు నటుల విభుఁడు
'తప్తయోస్సంధి' యనెడి శాస్త్రంబెఱింగి ॥ 103

కం॥ ఈరీతి సంధికార్యము
దారు వచింపుదురు మునులు తత్సంధి బలా
త్కారమునన్నైనఁ గార్యము
గౌరవలాఘవము లెఱిఁగి కావింపఁదగుఁగా ॥ 104

వ॥ ఇది సంధిస్వరూపంబు. ఇంక విగ్రహస్వరూపంబు వివరించెద.

విగ్రహ వికల్ప ప్రకరణము

కం॥ తమలోఁ దా రెప్పుడు కో
పముల నసూయలను బెరసి పలుమరు నపకా
రములె యొనరించుటలచే
నమరంగాఁ బొడము విగ్రహము మహిలోనఁగా ॥ 106

ఆ॥వె॥ ఫలముగోరువాఁడు పగవారిచేతను
వెతలఁ జెందువాఁడు చతురుఁడగుచు
నహితుతోడ విగ్రహము సేయవలయును
బలము దేశకాలబల మెఱింగి ॥ 107

వ॥ ఇట్టి విగ్రహంబు స్థానాపహారంబువలనను రాజ్యాపహారంబు వలనను, వనితాపహారంబువలనను, గ్రామాపహారంబువలనను,

నర్థవిఘాతంబువలనను, ధర్మవిఘాతంబువలనను, జ్ఞానాప హారంబువలనను, జ్ఞానశక్తివిఘాతంబువలనను, మిత్రార్థంబు వలనను, నవమానంబువలనను, సభిమానంబువలనను, బంధు నాశనంబువలనను, నేకార్థప్రీతివలనను, ధనాపహారణంబువలనను, గృతానుగ్రహభేదంబువలనను, దైవంబువలనను, ప్రకృతి క్షోభంబువలనను, దేశపీడనంబువలనను, బహుజనద్వేషంబు వలనను, గలుగుచుండు నిందుప శమనప్రకారంబెట్లన్నను గ్రమంబున వివరించెద. 108

సీ॥ స్థానరాజ్యములకు సతులకు మఱియు దే
శములకుఁ గా వచ్చు జగడమెల్ల
పుచ్చుకొన్నవి మఱల నిచ్చుటచే నొరుల్
గైకొన్నదమయు క్తిఁ గనుటచేత
నర్థంబు ధర్మంబు నడపఁబో రొదవఁదొ
ల్తటియట్ల యిచ్చి యేర్పుటలచేత
జ్ఞానాపహారంబు జ్ఞానశక్తివిఘాత
ముల నైన జగడంబు చలము కొనర

గీ॥ పట్టునర్థంబు వదలి చొప్పడుటచేతఁ
దనకొనర్పు నుపేక్షచేఁ దాల్మిచేర
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ దెలంగ
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 109

సీ॥ ద్రోహం బధర్మంబుతోఁ గూడుమిత్రుని
కలహంబుఁ దనయుపేక్షణముచేత
నెనసిననుంచిమిత్రునికైనజగడంబుఁ
దనటిగా వహియించుకొనుటచేత

అపమానమునఁగల్గు నావిగ్రహం బను
నయముతోఁగూడుమానంబుచేత
అభిమానమునఁ బుట్టినట్టి వైరంబు సా
మంబుచేతను బ్రణామంబుచేత

ఆ॥ బంధునాశంబువలనఁ జొప్పడినపోరు
దగిన యట్టి రహస్యవర్తనముచేత
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ జెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 110

సీ॥ ఏకార్థమునకుఁగా నిరువుర కగుపోరు
తనకోర్కివదలి వీడ్కొనుటచేత
ధనముఁగైకొనుటచే నొనరినజగడంబు
క్రోధంబుఁ జాలించుకొనుటచేత
సదరి చేయుననుగ్రహము మాన నగుపోరు
మగుడి యనుగ్రహమహిమచేత
దైవికగతిచేతఁ దనకైనజగడంబు
దైవంబు గూర్చుయత్నంబుచేత

గీ॥ మండలక్షోభమున నైన మచ్చరంబు
నందుకొనఁగూడి తగునుపాయములచేత
మందటిలఁజేయవలయు నెమ్మదిఁజెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 111

సీ॥ మించి దేశంబు బాధించఁగానైనపో
రతనిదేశముఁ గూల్చునందుచేత
బహుజనంబులతోడఁ బరగినజగడంబుఁ
దగుసామదానభేదములచేత

మానుపఁగావలె మఱి యిట్లు వొడమెడి
కలహముల్ దా మాన్పఁగదఁగఁదేని
సర్వంబు నొకవేళఁ జాల నాశనమొందుఁ
గావునఁ గడు విచక్షణత మించి

సీ॥ యేయుపాయంబుచేఁ బీడ యొసఁగకుండు
నాయుపాయంబుచే విగ్రహంబు లెల్ల
మందటిలఁ జేయవలయు నెమ్మదిఁ జెలంగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 112

॥ మఱియుఁ గొన్నిమతంబులవారు శత్రుప్రస్థానమువలనను, గ్రహంబులవలనను, వనితలవలనను, వాగ్దోషంబువలనను, నపరాధంబువలనను, బుట్టెడి వైరంబు లైదువిధంబులే యని పల్కుచుందురు. బాహుదంతితనూజుండు భూమియొక్క లద్దగించుటవలనను, భూమిబాధ గలుగుటవలనను, శక్తి చెఱుచుటవలనను, గడిరాజువలననుం బొడమెడి వైరంబులు నాలుగువిధంబులే యని పలుకుచుండు. మనుమతంబువారు కులమువలనను నపరాధంబువలననుం బొడమెడి వైరంబులు రెండువిధంబులేయనియును బలుకుచుందురు కైన నందుఁబూన రాని విగ్రహంబులు బదియాఱువిధంబులు గల వవి యెట్లనిన.

సీ॥ అల్పఫలంబై నయది నిష్ఫలంబును
ఫలము నిశ్చయలీలఁ బరగునదియు
నపుడు దోషముగల్గి యామీఁద ఫలమిచ్చు
నదియును దోషంబు లపుడులేక
యటమీఁద ఫలయుక్తి నలరకుండెడునది
యపుడు మీఁదట దోష మందునదియుఁ
దా నెఱుంగనికూరతను మించువానిది
పరులు ప్రేరేపఁ జొప్పడునదియును

గీ॥ నొచల కొఱకై నయదియును దెఱవకొఱకుఁ
గాఁగవచ్చినయది దీర్ఘకాలముదియు
నై నవిగ్రహముల నెల్ల మానపలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 114

సీ॥ బ్రాహ్మణోత్తములతోఁ బరగిన నదియును
వేళ గాకుండెడివేళ నెందు
దైవబలంబుచేఁ దగువానితోడిది
కలహంబునకె నిచ్చఁ గాలు ద్రవ్వ
నెరికాండ్రు గల్గినక్షితిపతితోడిది
తత్కాలఫలయుక్తిఁ దగుచునుండి
యామీఁద నిష్ఫలమైపచ్చునదియును
తత్కాలఫలయుక్తిఁ దగులనీక

గీ॥ యంతమీఁదట ఫలయుక్తి నమరునదియు
ననఁగఁ దగినట్టి పైపదియాఱుతెఱఁగు
నై నవిగ్రహముల నెల్ల మానవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 115

గీ॥ చేయునప్పుడు మీఁదటఁజేటులేని
విగ్రహమ్మైన యెపుడుఁగావింపవలయు
నవియ కా వన్నిపనులందు నటులఁగాఁగఁ
దలఁచి మెలఁగంగవలయు విచ్చలు విభుండు ॥ 116

ఉ॥ అప్పుడు మీఁదటఁ ఫలము నందఁగఁ జేయువిశుద్ధకర్మముం
దప్పక యాచరించుజననాథుఁడు నిందలఁజెందకుండుఁ దా
నెప్పుడు నట్లుకావున మహీస్థలిలో నిహముం బరంబుఁ దాఁ
జొప్పడఁ గూర్చునట్టిపని సొంపునఁజేయఁగ నొప్పుఁబ్రాజ్ఞుఁడై ॥

చం॥ ఒకయిసుమంతయర్థమునసుందెతు లోభముచేఁ బరంబుఁజెల
దక డిగ నాడఁగావలదు తత్పరలోకవిరుద్ధకర్మలం
బ్రకటముగాఁగ దవ్వులనె పాయుట మేలగు నిట్టి లాగము
ప్రకరము వల్కఁగావున నృపాలుఁడు సత్క్రియఁజేయు టేతగున్

సీ॥ బలము పోషణ మంది చెలఁగియుండెడివేళ
నసురక్తిమై ప్రజల్ దనరువేళఁ
దాను జూచినచూపు దైవ మీడేర్చుచోఁ
దనమిత్రు లతిభక్తిఁ దనరువేళ
సకలసామంతులు సంధిఁగోరెడివేళ
నాప్తమంత్రులు గలయట్టివేళ
ధనధాన్యములు చాలఁ దన కొనఁగూడుచో
నుత్సాహ మాత్మలో నుబ్బువేళఁ

గీ॥ బరుల కిటువంటి వెల్లఁజొప్పడనియట్టి
వేళ నొనరింపఁగాఁదగు విగ్రహంబు
ధనము మిత్రుండు భూమి నాఁ దగినమూఁడు
గతులఫలముల నొక్కటైనఁ గలుగఁ దెలిసి॥ 119

ఉ॥ మేలు ధనంబు ధాత్రిపయి మించునువస్తులకన్న నంతకున్
మేలు దలంప మిత్రుఁ డలమిత్రునికంటెను భూమి మేలగున్
మేలగుభూమిచేతఁ గడుమేలగు సంపద గల్గు సంపదన్
జాలఁగ బంధుమిత్రులును సద్గుణజాలము గల్గు నెప్పుడున్॥

కం॥ తనతో సమసంపదచే
ననువొందెడిశత్రుజనుల నప్రతిహతమై
తనరునుపాయముచేతనె
జనపతి శిక్షింపవలయుఁ జతురుం డగుచున్॥ 121

కం॥ కలహంబైన సుపాయ
మ్ములచేతనె తాళి శాంతిఁబొందింపఁదగుఁ
గెలుపులు దలఁప ననిశ్చయ
ములు గావునఁ ద్వరితగతుల మొనయక నృపతుల్ ॥ 122

మ॥ బలవంతుండగు శాత్రవుండు గినుకన్ బైవచ్చి బోధించినన్
గలఁగన్ బాలిక నిత్యసంపదల నాకాంక్షించుచున్ బుద్ధిని
శ్చలతన్ వైతసవృత్తిచే వినతుఁడై శత్రుం బ్రసన్నాత్ముఁగా
నలరింపందగు సర్వవృత్తు లటు పాయంబెట్టి నేర్పొందుగన్ ॥

తే॥ పాముఁరీతిఁ గ్రూరభంగిఁ జరించిన
విభుఁడు నాశ మందు వేగ జగతి
సిరులఁ జెందుచుండుఁ దిరముగాఁ బ్రబ్బళ్ళ
లీల వినయవృత్తి వాలునతఁడు ॥ 124

తే॥ మత్తురీతి వెట్టిమాడ్కిఁ దా నూరక
యుండివేళఁబైకి నుఱికి సింహ
మటులఁగ్రమముచేత నందినయది జాఱ
కుండఁబట్టి విజయ మొందవలయు ॥ 125

సీ॥ తాఁబేటిలీల యొంతయును ముడుంచుక
తనమీఁదవచ్చు బాధలకుఁదాళి
గట్టుకై వడి నిల్చి కదలక యోర్చుచు
ననువుగాకుండెడియట్టివేళ
యరిని మూపునఁబెట్టియైన మోవఁగనేర్చి
ప్రియభాషణంబులఁ బేలుపఱచి
కడుప్రసన్నాత్ముఁడై పుడమివార్త లెఱింగి
యరియంతరంగంబునందు నిల్చి

ఆ॥వె॥ సమయమెఱిఁగి కృష్ణసర్పంబుగతిఁ జిత్తు
మనుచు నొడిసి యగ్నియటుల భగ్గు
రనఁగ నెగసి నీతియనుచేత ముందలఁ
బట్టి తివియవలయుఁ బరులసిరుల ॥ 126

చం॥ నిలుకడఁగాంచి మేలెఱుఁగునేర్పు వహించి పరాక్రమంబునన్
గులమున మించి సత్యమునఁగూడఁగ ధైర్యదయాతిదానస
త్కళల వరించి యూర్జితుఁడు గౌరవశాలియునై నరాజు ని
చ్చలు నిలశత్రురాజుల కసాధ్యుఁడగున్ మదినెంచిచూడఁగన్ ॥

చం॥ పరుసముఁబల్కి మేల్మఱచి బాసలుదప్పి భయంబుఁజెందుచున్
గరువము దుఃఖమోహమియుఁ గల్గి ప్రమాదము బాగుచందమున్
విరసముఁజెంది జూదముల వేఁటల నింతులఁ బానలీలలన్
నిరతము నాచరించు నవినీతుఁడు సంపదఁజెందనేర్చునే ॥ 128

చం॥ గెలువగఁ గోరునట్టి దొర కీడుగుణంబులు గల్గుశత్రుపై
నలవుమెయిం ద్రిశక్తియుతుఁడై చనఁగాఁదగు నట్లుగాక ని
శ్చలగుణశాలియై తనరుశత్రుని మీఁదట నెత్తువాఁడు నే
ర్పులఁదనుదానె చంపుకొనఁ బూనుచునుండును నిందకర్హుఁడై ॥

చం॥ ఘనమగు రాజ్యసంపదలు గైకొను నిచ్చఁజెలంగి బుద్ధిచే
ననువగుమండలక్రియలనన్ని యెఱింగి దృఢప్రయత్నుఁడై
పనివడి విగ్రహస్థితులఁ బాగులఁజెందుచుఁ గార్యసిద్ధికై
యనిశముఁ బూనఁగావలయు నద్భుతశౌర్యసమగ్రచర్యలన్ ॥

వ॥ ఇదియు విగ్రహస్వరూపంబు. ఇంక యానప్రకారంబెట్లనిన.

## యానప్రకరణము

గీ॥ అధికబలవిక్రమంబుల నలరి ప్రకృతు
లాత్మగుణముల ననురక్తి నంది కొలువఁ
విజయమందుట కలమహీవిభుఁడు రిపుల
నడఁచుటకు దండువెడలుట యానమండ్రు ॥ 132

వ॥ అదియును విగృహ్యయానంబును, సంధాయయానంబును, ప్రసంగయానంబును సంభూయయానంబును, నుపేక్షా యానంబు ననియైదు తెఱంగులయ్యె వానిస్వరూపంబులు గ్రమం బున వివరించెద. 133

సీ॥ బలవంతుఁడరిప్రధానుల నిగ్రహించి దం
డెత్తుటయును దనహితులచేత
నరిమిత్రులను నొంచి యరిమీఁద దండెత్తు
నదియును విగ్రహయానమండ్రు
వెనుక శత్రులసంధి నొనరి యన్యుల మీఁద
నరుగుటయును దను నడ్డకట్టు
విమతులు సంధించి వేఱొక్క యరిమీఁద
నరుగుట సంధాయయాన మందు

గీ॥ రొక్కచోటికిఁ గదలి వేఱొక్కయెడకు
శల్యరీతిఁ బ్రసంగవశంబు కతనఁ
జనినయది ధాత్రియందుఁ బ్రసంగయాన
మండ్రు నయశాస్త్రవిదులై నయార్య లెందు॥ 134

సీ॥ శౌర్యశక్తులమించి చాల మూఁకలగూల్పఁ
గలిగిన సామంతగణము తోడఁ
గలసి శాత్రవులను గదుమ నుద్యోగించి
కదలిపోవుట చూడ నదియుఁగాక
ఫలమిత్తునని ప్రతినలు పల్కి కొంచెపు
దొరలతోఁ గూడుక యరుగునదియుఁ
దమప్రకృతుల నొంపఁ దా రిరువురు గూడి
యిరువురు శత్రుల నే పడంప

గీ॥ మునుపు సూర్యాంజనేయులు సనినరీతి
నరుగుటఁ దలంప సంభూయయాన మంది
రిట్టి యానప్రకారంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 135

సీ॥ శత్రుపై దండెత్తి చనుచోట నహితున
కపుడు సహాయుఁడై యతనికంటె
బలవంతుఁడగురాజు పై నెత్తివచ్చిన
మునుపటిశత్రుపైఁ జనక తాను
వాని నుపేక్షించి వానిసహాయుపైఁ
జన నుపేక్షాయాన మనఁగఁ బరగు
వాసవసూతి నివాతకవచులపైఁ
జని యుపేక్షాయానమననె తొల్లి

గీ॥ ప్రబలులై మించినట్టి హిరణ్యపురని
వాసులను గెల్వఁగదలిన వైపు దనర
నిట్టియానప్రకారంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 136

గీ॥ అరికి వ్యసనంబు గల్గినయట్టివేళ
నరికి దైవంబు దోడుగానట్టివేళ
నదనుఁ జేకొని దండెత్త నర్హ మంద్రు
నీతిమార్గం బెఱింగిననృపవరునకు ॥ 137

ఆసన ప్రకరణము

వ॥ ఆసన ప్రకారంబు. 138

కం॥ అరియును విజిగీషుఁడుగా
వరు లిరువురు బలిమికలిమి వడినొండొరులఁగా
దెరలింపలేక యుండుట
ధర నాసన మనఁగఁ బరగుఁ దజ్జ్ఞులచేతఁగా ॥ 139

వ॥ అదియును విగృహ్యాసనంబును సంధాయాసనంబును ప్రసంగాసనంబును, సంభూయాసనంబును, ఉపేక్షాసనంబును ననైదు తెఱంగులయ్యె వానిస్వరూపంబులు గ్రమంబున వివరించెద. 140

సీ॥ ఒక్కరొక్కరిసీమ రెండువారల్ గైకొని
　　మెండొడ్డి యెత్తిపోకుండుటయును
గడువైరితోడ విగ్రహమంది వాఁడు దు
　　ర్గస్థుఁడై సాధ్యుండు కానివేళ
ధాన్యాదికము మిత్రవితతులను గట్టియన్
　　గుంపును జొరకుండఁగాఁచియుండి
ముట్టడిగాఁ జుట్టుముట్టుకొనుచునుండు
　　నట్టిదియును విగృహ్యాసనంబు

గీ॥ వైరిపై నిట్లు ముట్టడి వైచి యెంచి
ప్రకృతు లన్నియుఁ జెడఁ జూపి పగఱఁ దనకుఁ
గైవశము చేసికొనఁ దగు కాలమెఱిఁగి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 141

సీ॥ రావణాసురుఁడు పూర్వమున నివాతక
　　వచులతోఁ బోరాడి వారుఁ దాను
నలసి చతుర్ముఖు నంపి సంధి యొనర్చి
　　నట్టులు విజిగీషు నరియుఁ బోరి
యలసి సంధియొనర్చి కలసియుండుటయు సం
　　ధాయాసనంబనఁ దనరుచుండు
నది గాక యరిమీఁద నలవునఁ గదలి చే
　　తోకప్రసంగము చెంది యొరునిమీఁద

గీ॥ కడఁగి దండెత్తిపోయి తా విడిసియుండు
నది ప్రయాణాసనం బన నమరుచుండు
నిట్టి చందంబు లెల్లఁ దా నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 142

సీ॥ అరివిజిగీషులఁ దా నాక్రమించుటకు మ
ధ్యముఁడు పై దండెత్తఁ దలచినప్పు
డరియును విజిగీషు వన్యోన్యమైత్రిచే
నొనగూడి బల్మిచే నుండు టొప్పు
నదిగాక ఘనుఁడైన యల యుదాసీనుండు
గినిసిన నరివిజిగీషువులను
నక్కడవారెల్ల నొక్కటైయున్న నం
ఘాయాసనం బనఁ బొలుపుమీఱు

గీ॥ నిట్టిభేదంబులెల్లను నెపుడు చిత్త
మందెఱుఁగనుండ నేర్చిన యట్టిరాజు
మదరిపుల గెల్చి సకలసంపదలఁ బొల్చి
జనులు వినుతించ మించి యిజ్జగతి నేలు ॥ 143

సీ॥ బలియుఁడై కృష్ణుండు పారిజాతముఁదెచ్చు
చోట నుపేక్షించి సురవిభుండు
వరరకయున్నట్లు పగతుఁడు బలియుఁడై
యున్నచోఁ దా నూరకుండునదియు
నొకహేతువునఁ జేసి యొకశాత్రవుఁడు పేర్చి
తను నుపేక్షించిన దానిఁగొనుచు
మును రుక్మియుండిన యనువున నుండుట
యది యుపేక్షాసన మనఁగఁ దనరు

గీ॥ ఇట్టిభేదంబు తెల్లఁ దా నెప్పుడు చిత్త
మం దెఱిఁగియుండ నేర్చినయట్టి రాజు
పరరిపుల గెల్చి సకలసంపదలఁ బొల్చి
జనులు వినుతింప మించి యీజగతినేలు ॥ 144

## ద్వైధీభావ ప్రకరణము

వ॥ మఱియు ద్వైధీభావంబు స్వతంత్రపరతంత్ర భేదంబున రెండు
తెఱంగు లయ్యెనందు స్వతంత్ర ద్వైధీభావం బెట్లనిన. 145

సీ॥ ఇరుదిక్కులకుఁ దన కిద్దఱుశత్రులు
బలవంతులై యున్నఁ గలఁచిపడక
వారివారికిఁ జూడ వారివాఁడును బోలెఁ
దన్నుఁ దక్కొఁడుగా నెన్నిపల్కి
కాకాక్షివలె నిరుగడల వర్తింపుచు
సందుఁ జేరువదాన సధికయత్న
మునఁ గడుపుచు నిద్ద రెనయక యొత్తిన
సందులో బలవంతు నాశ్రయించి

గీ॥ వార లిద్దఱు వదలిన వారియరులఁ
దాన బలవంతు నొక్కనిఁ బూని కొలిచి
యతఁడుఁగా నేర్చి కాలంబు గడపెనేని
యది ద్వైధీభావగుణ మని యండ్రు బుధులు ॥ 146

కం॥ సాధారణుఁడై యిరుగడ
బాధకులకు నెనసి ధనముఁ బొరయుట యది వా
సిధారుణిఁ బరతంత్ర
ద్వైధీభావం బనంగఁ బరఁగుఁ బ్రాజ్ఞులచేఁ ॥ 147

## సమాశ్రయ ప్రకరణము

క॥ మఱియు సమాశ్రయగుణంబు బలవంతుండగు నరివిభుండైనను
గాక తనశత్రువునైన నాశ్రయించుటంజేసి రెండు విధంబులై
యుండుఁ బరిక్రమం బెట్లనిన. 118

సీ॥ బలవంతుచే నొంపఁబడి నిరుపాయుఁడై
ప్రతిసేయఁగా లేక బడలినపుడు
కులమును సత్త్వంబు బలమును గల్గిన
యార్యుని నొక్కని నాశ్రయించి
వినయంబుతో నిత్యమును బొడగని చేరి
యతనిభావం బెల్ల నాత్మ నెఱిఁగి
చెప్పినకై వడిఁ జేసి వినీతుల
గతి సుగుణులఁ గొల్చువరవిఁ గొల్చి

గీ॥ యతనిదయచేతఁ బరిపూర్ణుఁడై స్వతంత్ర
వృత్తిఁ జెందుచుఁ గ్రమమున వెలయు బొందు
నట్టి యన్యసమాశ్రయం బెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 119

సీ॥ అహితులచే నొచ్చి యార్తుఁడై యాశ్రయ
హీనుఁడై తగు సంధి లేనివాఁడు
భండారమైనను బలమునైనను భూమి
యైనను భూఫలంబైన మఱియు
సకలంబునైన నిశ్చలతఁ జెందుచు నిచ్చి
యతివినయంబున నతనిఁ జేరి
తా బన్మిచెందినతఱి నైన శత్రువుఁ
డాపదఁ జెందిన యప్పుడైన

మొదలుగను గొన్నిమతంబులవారు షడ్గుణంబుల వాధింపం బడినవాఁ డితఁడని నాశ్రయించుటంజేసి సమాశ్రయమనంబుఁ బ్రత్యేకంబు గాఁబున నాసంధివిగ్రహంబులు దెలుపును సిట్టి సమాశ్రయంబుసంగూడి షడ్గుణంబులే యని పలుకుచుండుదురు. మఱియుఁ గొన్నిమతంబులవారు సంధ్యాదిగుణపంచకంబును విగ్రహమూలంబె కావున విగ్రహగుణంబొక్కటియె న్యాయం బని పల్కుచుందురై నను వీని కన్నిటికిఁ బ్రత్యేకంబైన యవస్థాభేదంబులు గలుగుటంజేసి యీ కామందకమతంబునకు షాడ్గుణ్యంబె సమ్మతంబు ॥ 154

కం॥ ఈరీతిషడ్గుణంబుల
నేర్పువుతోఁ దెలియునట్టి నృపవరుఁ డెలమిన్
వైరులను గెలిచి పారా
వారావృతమైనధరణిపలయుం బేలున్ ॥ 155

చం॥ సరసవిహార సారయుతసద్గుణ సింధుగభీర నీతి సు
స్థిరరుచికీర్తిహార సుదతీజనమన్మథ సూర్యవంశభా
స్వరతర సేవితార్యజనసైన్యవిరాజిత సోమపాత్రభృ
చ్ఛరనిధిదాన సౌమ్యహిత సంతతశోభన సర్వసన్నుతా ॥ 156

కం॥ మండలశోధన సాధన
పాండిత్యా షడ్గుణప్రభావజ్ఞ ధరా
మండల పాలనఖేలన
దండితమత్తారిభూప దానకలాపా ॥ 157

భుజంగ ప్రయాతము.

ధరాధార దోర్దండ చాపప్రచండా
పరాభేద్యమంత్రప్రభావ స్వతంత్రా

స్ఫురద్గాంగ భంగాహిభూషాంగవాణీ
తురంగాబ్జ శీతాద్రితుల్య స్వకీర్తీ ॥ 158

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాలవరప్రసాదలబ్ధ సారసారస్వత భారద్వాజగోత్ర పక్కిరాజయెల్లనామాత్యపుత్ర సుకవిజనవిధేయ శ్రీరామకృష్ణభక్తి వైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన రాపింపిర నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు మండలభేదప్రకారంబును షడ్గుణప్రచారంబు నన్నది చతుర్థాశ్వాసము.



# ఆంధ్ర కామందకము

## పంచమాశ్వాసము

కం॥ శ్రీవినుతాలోక జగ
త్పావన రఘురామ పాదపంకజయుగళీ
సేవాధురీణ శాంత
ప్రావృత కొండ్రాజువెంకటాద్రి నరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### మంత్రవికల్ప ప్రకరణము

గీ॥ నృపతి షడ్గుణతత్త్వంబు నిశ్చయించి
గూఢ మగుచర్యఁ దగ మంత్రపదవులఁ దగుచు
మంత్రివర్యులతోఁ గూడి మంత్రరీతు
లమర నూహింపఁదగు రహస్యంబుగాఁగ ॥ 3

కం॥ తన కాప్తుండై తగుప్రా
జ్ఞునితో మంత్రం బొనర్పఁ జొప్పడుఁ బతికిన్
దన కాప్తుండౌ మూర్ఖునిఁ
దన కాప్తుఁడుగాని ప్రాజ్ఞుఁ దా విడువఁదగున్ ॥ 4

కం॥ ధర యెల్ల ననుభవించును
నరనాథుఁడు మంత్ర మెఱిఁగినం గాకున్నన్
బరిభవ మొందు స్వతంత్రతఁ
బరగియు మంత్రంబు నెఱుఁగఁ బ్రాజ్ఞులచేతన్ ॥ 5

కం॥ పగతులచే దుర్మంత్రుం
డగుపదార చెడు దుష్టమంత్ర మగుయజ్ఞము వై
ర్యగణముచే బతెఁ గావున
జగతిన్ సన్మంత్రమునఁ బొసంగఁగవలయున్ ॥ 6

చ॥ అనిశము ధర్మమార్గములయందె చరించినవారు సిద్ధమై
యొనరినయట్టి కార్యముల నూర్జితులై తగువారు పెద్దలై
వినరినవారు నై నగుణధన్యులు చెందినశాస్త్రమార్గ మెం
చను వదలంగ రారు నయధుర్యులకున్ నిజకార్యసిద్ధికిన్ ॥ 7

కం॥ జనపతి శాస్త్రముతో నెడ
సినపర్వుల వేగిరమునఁ జెంది మెలఁగినన్
దనశత్రునిచే ఖడ్గం
బునకున్ గ్రాసంబు గాకపోవం గలఁడే ॥ 8

కం॥ బలిమిఁ ద్రిశక్తులలోపల
నల మంత్రము మంత్రశక్తి ననువొందక కే
వలము ప్రభావోత్సాహ
మ్ములఁ గల్గియు శక్రుఁ డోడె మును గురువునకున్ ॥ 9

ఉ॥ నీతి యొకింతయుం దెలియనేరని సింగము బల్మిచేతఁ దా
నేతఱియందు నేనుఁగుల నెల్ల వధింపుచు నుండు బుద్ధియున్
నీతియుఁ గల్గినట్టిపతి నేర్పున సింగపుగుంపులం గరి
వ్రాతము సుక్కునం గెలిచి వర్ధిలకున్నె ధరాతలంబునన్ ॥ 10

గీ॥ మునుపు సామాద్యుపాయముల్ మొనపవలయు
కాల మెఱుఁగుచు వైరిపైఁ గదియవలయుఁ
గాక మఱి కేవలంబు విక్రమముఁ బూని
మెలఁగువాఁ డెందు వగఁ జెంది కలఁగకున్నె ॥ 11

కం॥ విపులమతు లెంచి శాస్త్ర
క్రమమున నొనరించునట్టికార్యంబులు వే
గమె మంచిఫలము లిచ్చుఁ దా
నమరంగాఁ బ్రోదిఁగనినయల వన మనఁగన్ ॥ 18

కం॥ అనువుగ నొనరించినపను
లనిశము ఫలియింపుచుండు నది కాకున్నన్
మనమునకుఁ దాప మొసఁగవు
మును దెలియక సేయుకార్యములుబలెఁ బతికిన్ ॥ 19

గీ॥ నేర్పు మీఱంగ నెన్న యొనర్పఁబూని
కార్య మొకరీతి సఫలంబు గానివేళ
వాఁడు నిందకుం దగినట్టివాఁడు గాఁడు
తానె దైవంబు కడఁదోడుగానికతన ॥ 20

కం॥ ఫలములకై నిర్మలమతి
గలవాఁ డుద్యోగశాలి గావలె నెందున్
ఫలవిఘ్న ముదరకుండన్
బలవద్దైవంబు నెఱిఁగి ప్రార్థింపఁదగున్ ॥ 21

కం॥ తనబలిమి నెదిరిబలిమిం
గనుఁగొని యరిమీఁద గదలఁగాఁదగు నెడపం
దను నెఱుఁగుటెద్ది యదియో
జనపతులకు నెఱుక నీతిచాతుర్యంబుల్ ॥ 22

కం॥ ఆర్యులు విడుచురు నిష్ఫల
కార్యము నిశ్చితఫలంబు గలుగక యెడరౌ
కార్యము బహువైరముఁ గల
కార్యము కడుగ్లేశమడచుకార్యముఁ బుడమిన్ ॥ 23

కం॥ తనకార్యములె విహితమునఁ
దగిలినయవి యెప్పుడు మీఁదఁ దా మంచివియై
తగు నవి తొలుతన్ సజ్జను
లగువారిక్రమాగతంబు లైనవి పతికిన్ ॥ 24

గీ॥ ఎట్టికార్యంబు దనరను హిత మొనర్చు
నెట్టికార్యంబుచే నింద లెనయకుండు
నట్టికార్యంబె పూని చేయంగవలయు
నప్పు డించుకరతిసమై యడరెనేని ॥ 25

కం॥ సులభమునఁ గార్యసిద్ధులు
గలుగుటకై బుద్ధిచేతఁ గార్యము చూపన్
వలయుఁ బతి మంచిమిత్రులఁ
గలిగినచో సింహవృత్తి కడు మేలొకటన్ ॥ 26

చం॥ తొడిఁబడ మించి పైకుఱికి దుష్టవిరోధుల వంచి సంపదల్
పడయుట లెంచ దుష్కర ముపాయబలమ్మున నేదియైనచొ
ప్పడి తనుమావటీఁడు బలభద్రగజంబుశిరంబుమీఁదటన్
దొడరియు వాయుమార్గములతోడఁ బటంబు విసు మెంతయుఁ జూడమే ॥

ఆ॥వె॥ చతురమతి కుపాయసరణిచే సాధ్యంబు
గానివస్తు వించుకయును గలదె
యినుపముద్ద యైన నిలలోన నీరుగా
కఱఁపఁ బడును చెఱిపి విఱువఁబడును ॥ 28

కం॥ జల మింగలంబు నార్చుట
యిలమీఁదటఁ గడుఁబ్రసిద్ధి యీయింగలమే
బలువగు నుపాయశక్తిని
జలచలచలఁ దెరలఁజేసి జల మిగిరించున్ ॥ 29

వ॥ మఱియు మంత్రంబునకు జ్ఞానంబును, రక్షణంబును, బ్రకా
శంబును బ్రకీర్తియు సంగంబులును వ్యాపారంబు నుత్పత్తి
ప్రమాణంబును బరిశుద్ధియు ఫలసిద్ధియు నావర్తనంబును, ధారణం
బును, మొదలయిన యవస్థాభేదంబులు గల యందు విషయంబు
సాక్షాత్కారంబునం దెలియనియర్థంబు లెల్లం దెలియుట యనెడి
యవిజ్ఞాతవిజ్ఞానంబును దెలిసినయర్థంబు కర్తవ్యపూర్వకంబుగా
నిర్ణయంబుగావించుటయనెడి విజ్ఞాతనిశ్చయంబును నుభయ
తెరంగు కార్యంబులు ప్రసక్తంబులైన నొకటి గాపాడుట యనెడి
సందేహభేదనంబును, వెండియు సంధివిగ్రహంబులలోన నృష్ట
సమ్మతంబున సంధియ మంచిదనుటఁ దెలిసి యదియును భేద
పూర్వకంబైన లెస్సయని తెలిసికొనుట యనెడి శేషదర్శనంబును
నను నిట్టి చతుర్విధ భేదంబులుగల జ్ఞానంబు మంత్రులవలనను
సంభవించుంగావున. 30

సీ॥ మంత్రులుఁ దాసను మతులందు లెస్సగాఁ
బరిశుద్ధి సేయు టుత్పత్తియండ్రు
దనదు నుత్పత్తిచేఁ దనమంత్ర మది లెస్స
తెలిసి రక్షించుట స్థితియటండ్రు
చాల దానినిఁ బ్రకాశంబుగాఁ జేయుటే
మఱి లయ మని యండ్రు మంత్రమునకు
నిన్నియు నెఱుఁగుచు నిది దేశ మిది కాల
మిది యూయ మిది ప్రయం బిది బలంబు

గీ॥ దీని రిది యుక్త మంచును దెలివితోడ
మంత్రవిదులను గూడి నెమ్మదిఁ జెలంగి
శాస్త్రమార్గంబు వదలక చతురుఁ డగుచు
మంత్ర మూహింపవలయును మనుజవిభుఁడు॥ 31

కం॥ జనపతి తనమంత్రులయా
ప్తిని మెలఁగవలె నండి మెచ్చినజనులును దాఁ గా
వినక మఱి యన్నిపలుకులు
వినవలయును మంచిమాట వెదకెడికొఱకై ॥ 32

కం॥ తనమది మదించి పనియెడఁ
దనమంత్రుల మీఱుపతి వృథామంత్రుఁడు పే
డని నింద నొందు నతనిని
గనుఁగొని రిపు లాక్రమింపఁ గడఁగుదు రెపుడున్ ॥ 33

కం॥ మంత్రము రక్షింపఁగవలె
మంత్రము మూలంబు మిగుల మనుజేంద్రునకున్
మంత్రము చెడఁ దాఁ జెడుఁ గ
న్మంత్రము రక్షింప రక్షణముఁ గలుఁ దానున్ ॥ 34

కం॥ మతుమఁడయి కాల మెఱుఁగుచు
నతులితగతి సింహవృత్తి నడచెడుధరణీ
పతి కార్యము సేయుతఱిన్
హితులును నది దైన నహితు లెఱుఁగఁగవలయున్ ॥ 35

కం॥ ఫల మెవ్వేళ నొసంగన్
గలుగునుఁ గడువేగఁ గోర్కె ఘటియింపంగాఁ
గలుగునుఁ బశ్చాత్తాపము
గలిగింపనియట్టిమంత్రిగతి మంచిదగున్ ॥ 36

మంత్రాంగములు

ఆ॥వె॥ దేశకాలగతులు దెలియుట, సాధనో
పాయచింతయును, సహాయవితతి,
నాపదలకుఁ బ్రతిక్రియయుఁ, గార్యసిద్ధియు
నైదు మంత్రమునకు నంగము లగు ॥ 37

కం॥ పూనినపనిఁ జేయవలెన్
మానినను వెల్లఁ బొడవడి పూనఁగవలయున్
మాని యొనరించునాతని
దా ననువుగ విరివికొనఁగఁ దగు న్యాయమునన్ ॥ 38

కం॥ ప్రారంభింపక యుండుట
పూనుటనకుఁ బ్రథమబుద్ధి పూనికతోడం
బ్రారంభించినపని యా
దేయుటుట ద్వితీయబుద్ధి యాధరలోనన్ ॥ 39

కం॥ సారెకు బహుమంత్రులతో
భూరిమయిఁమి కార్యమార్గములు దలఁచఁదగున్
వారలకును సమ్మతమగు
సారపుఁగార్యంబుఁ బూనఁ జను నెర్పొనరన్ ॥ 40

గీ॥ ఎంత సజ్జనులగువారు నింద సేయ
రెంతఁ దనమది సందేహ మంతటంత
యెంత మంత్రులు సమ్మతిఁ జెంది యుండ్రు
తలఁప నటువంటిపనిఁ బూనవలయు విభుఁడు ॥ 41

కం॥ మంత్రులచే నిశ్చితమగు
మంత్రముఁ జింతింపవలయు మదిఁ బలుమారున్
మంత్రజ్ఞుఁడగునృపుఁ బతిఁ దన
మంత్రముచేఁ దనమనసులు మఱి చెదకుండన్ ॥ 42

కం॥ వారలు మొగియక యుండన్
దా రొనరింపుదురు మంత్రితతి దడవడరన్
బోరులు మొగియక యుండిన
సారపుభోగములు దమకు సమకొనుచుండన్ ॥ 43

### కార్యసిద్ధి సూచకములు

గీ॥ పౌరుషంబు సహాయసంపద మనఃప్ర
సన్నతయు దేహదార్ఢ్యంబు సమకొనుటయు
బుద్ధి విశ్వాసమును జాలఁ బొడముటయును
గార్యసిద్ధికి గుఱుతులై కానుపించు ॥ 44

కం॥ సులభములగు యత్నంబులు
గలుగుట, తగుసాధనములు గలుగుట, విఘ్నం
బులు లేకుండుట, కార్యం
బులకున్ ఫలసూచకములు భువి నివి తెలియన్ ॥ 45

కం॥ పలుమరు మదిలోఁ దలఁపఁగ
వలయున్ మంత్రము ధరింపవలయును యత్నం
బలరఁగ నటుగాని యెడం
జలియింపుచు నగ్నిలీలఁ జాల దహించున్ ॥ 46

కం॥ వెలిపడు మంత్రం బాప్తుల
వలనన్ రక్షింపకున్న వసుధాపతికిన్
దెలిసి యటుగాన నాప్తుల
వలనను మంత్రంబుఁ బ్రోవవలె యత్నమునన్ ॥ 47

ఆ॥వె॥ కలువరింతపలుకువలనఁ గామమువల్ల
మదమువలన మఱి ప్రమాదములను
గదిసి గుట్టుఁ దెలియుఁ గామినీవితతుల
వలన మంత్ర మదియు వసుధలోన ॥ 48

గీ॥ కంబములు లేక సోరణగండ్లు లేక
నడుమ గోడలు లేక పెంపడరుచోట
మేడపైఁ గానలో నైన మెలఁకు వలర
మంత్ర మూహింపవలయును మనుజవిభుఁడు ॥ 49

## మంత్రిమండల వృత్తము

సీ॥ తొలుదొల్త మంత్రిమండలముతో మంత్ర మూ
హింపఁగాఁ దగు నభివృద్ధికొఱకు
నది యెట్టు లన్న దేవాచార్యమతము వా
రఖిలసమ్మతిఁ బదియాఱ్వు రంద్రు
మనువు పన్నిద్ద రైనను జాలు నని పల్కె
మఱియు శుక్రాచార్య మతమువార
లిరువదియగుసంఖ్య నెంతు రీమంత్రుల
నితర మతంబువా రెటులనైనఁ

గీ॥ గలిగినందఱె చాలు మంత్రు లని యందు
రిటుల మంత్రులసంఖ్యఁ దా నెఱుఁగ నేర్చి
వారిఁ దెలియంగఁదగు వేఱు వేఱ సారె
శాస్త్రమార్గంబు వదలక జనవిభుండు ॥ 50

చం॥ హితుఁడయి మంచిపక్షమున నెన్నిక కెక్కుచు నీతిశాస్త్రసం
గతముగఁ గార్యచర్యలఁ దగం జరియించినవాఁడు నాత్మస
మ్మతుఁ డగువాఁడునైన తనమంత్రిశిఖామణి పల్కినట్టి యా
మతమె యొనర్పఁగా నగును మానవనాథుని కెట్టివేళలన్ ॥ 51

కం॥ మును మంత్రనిశ్చయంబున
నెనసి నృపుల్ కార్యకాల మెఱిఁగి మెలంగన్
జనుఁ గాలము మీఱినచో
ననుపుగఁ గల్పింపవలయు నది మగుడంగన్ ॥ 52

కం॥ అదను మదిఁ గోరుచుం దగు
నద నొక్కొకవేళ దొరకునప్పుడు దనపనుల్
కొదవయిడికొనినఁ గ్రమ్మఱ
నద నబ్బుట దుర్లభం బటంద్రు నయజ్ఞుల్ ॥ 53

కం॥ మతిమంతుఁడు సన్మార్గము
గతిచే సద నెఱిఁగి సేయఁగాఁ దగుఁ గార్యం
బతినియతి నెటులనైనన్
క్షితిలోపల మంచిఫలమె చేకొనుచుండున్ ॥ 54

మ॥ ఇది యీరీతిది దీని కిట్లనుచుఁ దా నెంతే విశదాత్ముఁడై
యదనన్ దేశమునందు భూపతి సహాయశ్రేణితోఁ గూడి స
మ్మద మొప్పన్ బరిశుద్ధపౌరుషుఁడగుచున్ మత్తారివీరావళిం
జదుపంగాఁ దగుఁ గాక చాపలగుణేచ్ఛన్ వర్తిలం జెల్లునే ॥ 55

చం॥ అహితములైనఁ గార్యములయందు హితంబును బుద్ధి నేర్చి యా
మహిపుఁడు మూఢుఁడౌనతఁడు మంత్రులమాటఁ దిరస్కరించి తా
సహితులమీఁదటం జపలుఁడై కడు వేగమె పోయి వారునన్
మహితకరాసులెత్తి పరిమార్చినచోఁ జెడు నస్మసంబునన్ ॥

చం॥ ఎదిటిబలాబలంబు లొకయింత యెఱుంగక మంచిసాహసం
బొదవ మదించి మించి బలియుండను నేనె యటంచుఁ గొంచమౌ
మదిఁ దమకించుభూపతి సమంచితచంచలవృత్తి శత్రుపైఁ
గదలి మరంబులోనఁ బడుఁగాక సుఖస్థితి నుండ నేర్చునే ॥ 57

మ॥ అమితోద్యోగముఁ గల్గినట్టిరిపురాజానీకముం గ్రూర స
ర్పములం బోలె నయప్రవర్తనలచే భాసిల్లుభూపాలకుం
డమర న్మంత్రబలంబుచేఁ దనకు లోనై యుండఁగాఁ జేయు దృ
ఢ్హమగున్ ధారుణి నట్లొనర్చిన నృపాలాగ్రేసరుండై తగున్ ॥

వ॥ ఇది మంత్రస్వరూపం బింక దూతచారులప్రకారం బెట్లన్నను. 59

చం॥ అనువుగ మంత్రముం దెలిసి యందలి యర్థము లాచరించురా
జనిశము దూతకృత్యములయం దభిమానముఁ గల్గి మంత్రులౌ
జనులకు నెల్ల మంత్రమున సమ్మతుఁడై తగుదూతఁ బంపఁగాఁ
జను సమయంబుఁ ద్రొబ్బుటకు శాత్రవమర్మవిభేదశాలియై ॥ 60

కం॥ తలఁచుకొనుశక్తి ప్రౌఢిమ
పలుకులనేర్పులును శాస్త్రపరిచితిఁ గార్య
మ్ముల యభ్యాసము నాయుధ
ములతెలివియుఁ గలుగువాఁడు భువి దూత యగున్ ॥ 61

## దూతభేదములు

సీ॥ కార్య మెంతయు హ_స్తఁగాఁ జేయఁజాలిన
యతఁడు నిసృష్టార్థుఁ డనఁగఁ బరఁగుఁ
జెప్పినట్లే పోయి చేయఁగా నేర్చిన
యతఁ డరయ మితార్థుఁ డనఁగఁ బరఁగు
నేమియు నెఱుఁగక యేలినాతనికమ్మ
లందించ శాసనహారకుండు
జగతిలో నీరీతిఁ దగి మూఁడు దెఱఁగులై
చరియింతు రీదూతజనులు పరుసఁ

ఆ॥వె॥ బరజనంబు లిటులఁ బలికినఁ దా నిట్లు
పలుకవలయు ననుచుఁ దలఁచికొనుచుఁ
బోవఁదగినయెడకుఁ బోవఁగా వలయును
క్షితిపవరునసుజ్ఞచేత దూత ॥ 62

కం॥ అలజడివారల నాటవి
కులఁ దనకున్ లోనుజేసికొనఁదగు మఱియున్
జలములపెక్కులు త్రోవలు
దెలియఁగఁదగు దనదు నేనఁదెప్పుట కొఱకై ॥ 63

కం॥ అరిపురము నతనిసభయుం
జొరవలయుఁ బ్రకారరీతిఁ జొప్పడ నరిచేఁ
బరికింప నునుమతుండై
యురవుకొనం జనఁగ నొప్పు నిల దూతలకున్ ॥ 64

ఆ॥వె॥ శత్రు సతనిరాష్ట్రిసారంబు సతని మి
ర్గంబు పర్గరక్షణంబు మిత్ర
వితతి యతనికినియుపేశ ఖండారంబు
రెస్సఁ దెలియవలయు లీల యూత ॥ 65

చం॥ చనవిభుఁడెట్లుపల్కు మన దా నరితోడుత నట్లు పల్కఁగాఁ
జనుఁ దనమీఁదఁ గైదువలు సాఁచిన నించుక ధీతి రేక చూ
పుని ముఖచేష్టపల్లఁ దలపోయుచు రాగవిరాగభావముం
గనుఁగొనఁగాఁదగుఁజూమఱియుఁగార్యమెఱుంగఁగఁదూరి దాతుఁగా

చం॥ తనకు సనిష్టవాక్యములు దాశఁకొనఁజా జనుఁ గామమునఁ బనం
బుసు మఱి క్రోధము న్విడచి పోఁ దఱుమం దను సద్రపోపగాఁ
జన దొరతోడఁ గూడుకొని చాలఁబరేంగితముల్ గనుంగొనఁజా
జనుఁ దనభావ మెయ్యడఁ బ్రచారము సేయఁగ రాదు దూతకుఁజా॥

గీ॥ వైరులందు సమాత్యాదివర్గ మనెడి
ప్రకృతులకుఁ గల్గురాగాపరాగములకుఁ
దెలియఁ దగు మఱి భేదింపవలయు వారి
నరసి భేదింపఁ దగు రహస్యంబుగాఁగ ॥ 68

కం॥ తనపతిగుణములఁ బ్రకృతులఁ
దను నడిగినఁ బలుకవలదు ధరణీశులతో
డను సర్వము మీ రెఱుఁగరె
యని పల్కఁగ వలయు మంచిపగుపల్కులచేఁజా ॥ 69

కం॥ కులమునుఁ గడుఁ బేరెన్నిక
గలుగుట ఘనమైనయట్టి కార్యపుసేతల్
కలిమి యన నాల్గుదెఱఁగులఁ
గల వినుతులఁ బతిని రిపుని గణుతింపఁ దగున్ ॥ 70

ఉ॥ జీతము రెండువిక్కులను జెందెడివారలచేత శిల్పముల్
చాతురి గల్గువిద్యలు విచారము సేయునెపంబుతోడఁ దా
నేతతి శత్రురాజు ఘటియించినకార్యము భేదకోటి ధా
త్రీతలభర్త నేయఁ దగురీతులు మాతయెఱుంగఁగాఁ దగున్ ॥

గీ॥ తీర్థముల నాశ్రమంబుల దేవళాల
యములయందుఁ దపస్వివేషముల మెలఁగు
నట్టివారలతో మాటలాడవలయు
శాస్త్రరీతుల దెలియువ్యాజంబుచేత ॥ 72

కం॥ తనవిభుఘనత ప్రతాపం
బును మంచితనమ్ము భృత్యులను గరిమ కులం
బును దానము నుత్సాహముఁ
బెను పొందఁగఁ బలుకవలయు భేద్యులతోడన్ ॥ 73

కం॥ ఇల నిపుణపోతు మత్తుఁడు
గలభావమె బలుకుచుండుఁ గాని బూతి యొరులం
గలయక నిష్ఠురపోఁ దగు
పల చెప్పుడు బోనములను విని తలఁ చూలన్ ॥ 74

కం॥ తనకార్యసిద్ధికొఱకై
ఘనముగఁ దడవైనయపుడు గడు వెతఁబడఁగాఁ
జన దెపుడు దూతవర్యుఁడు
తనకార్యము పొసఁగువిధమె తలఁపఁగ వలయున్ ॥ 75

వ॥ మఱియు రాయబారియగునతండు శత్రురాజు ననుసరింపుచు
నుండునెడఁ దమయేలికర్తారయును సౌఖ్యంబడిక యాలస్యంబైన
యెడఁ గ్రమంబున మంచిదనంబు మించ పంచనావాస్త్ర
ప్రపంచంబులఁ గాలంబుఁ గడపుతెఱఁ గెల్లన్నను, దనవిభునకు

నొకయించుక వ్యసనంబుఁ గలిగియున్నకతనను, నొయింతో
నొకయించుక వ్యాజ్యంబుగలుగు కతనను దాయబంధువులలోనఁ
గలహంబుఁ బుట్టిన నీతిపరుండు గావున నదియు వారించు
కతనను ఫలకాలంబు గాన ధాన్యాదిసంగ్రహంబు సేయుచుండు
కతనను దుర్గంబునకు నవరణలు సేయించుచుండుటనుఁ దన
సైన్యంబులకు క్షేమంబుఁ గోరువాఁడై వర్షాదికాలదేశవిష
యంబులవలనఁ దా రాకయున్నకతనను దాన ధనాదికంబు
వట్టించుకొని వచ్చువాఁడై యున్నకతనను, వెలిగుడారంబులు
వేసి పయనంబునకు సామగ్రి యొనఁగూర్చుకొనుచుండుకతనను,
నాలస్యం బయ్యెనని యుచితరీతులఁ గాలంబు గడుపుచు నుండి.
శత్రువునకుఁ గార్యకాలంబులోనఁ గూడకయుండుట లెస్సఁ దెలిసి
మగుడివచ్చియైనను రాకయుండియైనను శత్రువార్తలన్నియు
లెస్సగాఁ దనయేలికకు నెఱింగించవలయు ననియును. 76

సీ॥ పగఱసామర్థ్యంబు బలమును దుర్గంబు
 భండారమును మిత్రబంధుతతుల
సతఁడు పూనుచునుండు నట్టికార్యంబుల
 తెఱఁగులు లెస్సగాఁ దెలియుటయును
గడలఁగావలివారి నడపులకడవారిఁ
 దనవారిగాఁ జేసికొనుట మఱియుఁ
దమ కనిసేయఁగాఁ దగుచోట మగుడి పో
 వనువైనచోటుల నరయుటయును

గీ॥ దూత యొనరించుపను లంద్రు దూతజనుని
వలన నెఱుఁగంగ వలయును వైరిచర్యఁ
నజనమ్ములయందును ధరణినాథుఁ
రివరులదూతచేష్టల నరయ వలయు॥ 77

దూతచరవికల్ప ప్రకరణము — దూతలక్షణము

ఉ॥ తలఁపున మించి క్లేశములు దాఁకి ప్రయాసము నోర్చి దక్షుఁడై
చెలఁగుచుఁ బోవ రాఁ గలిగి శీలముఁ జెంది పరేంగితంబు నూ
హలు దనలో నెఱింగి కఠినాత్ముఁడు గా కటు యుక్తిపెంపునం
గలిగినవాఁడు దూత యనఁగా నుతికెక్కుచునుండు నెచ్చటన్॥

వ॥ ఇది దూతలక్షణం బగు నింకఁ జారలక్షణంబు వివరించెద. 79

చారలక్షణము

కం॥ మునులును జోగులు శిల్పులు
ననఁ దగి దిశలందు ధూర్తులై తిరుగంగాఁ
జను వేగువారు వార్తల
ననువుగఁ దెలియుచును బలికి నవి తెల్పుటకై॥ 80

చం॥ ఇలఁ గల చారకార్యముల నెల్లఁ గనుంగొనఁ జాలునట్టి వ
న్నులు పతి కెందు నెంచఁగ వినూతనచాతురిఁ బొల్చువేగువా
రలె కద కాన వారలు ధరాతలమందుఁ జరించుచు సర్వవా
ర్తలు దెలుపం జనుఁజా బతిహితంబుగ వచ్చుచుఁ బోవుచుండఁగన్

చం॥ చెలఁగెడు సూక్ష్మసూత్రములచేత బలెం దనవేగువారిచే
నిలఁ గల సర్వవార్తలు మహీపతి దా నెఱుఁగంగ నొప్పు ని
ట్లలపునఁ జారచక్షుఁడయి యందము నొందినరాజు నిద్రచే
నలరినవేళ మేల్కొనినయట్టివిధంబున మించు నెంచఁగన్॥ 82

గీ॥ కదలుటలచేత వ్యాపించు గాలిలీలఁ
గిరణములచేత వ్యాపించు తరణికరణి
నరపతికి లోకసమ్మతులైన వేగు
వారిచేతనె వ్యాపించవలయు జగము॥ 83

బహువేషధారులై పరగెడివారలు
మంత్రముల్ మంత్రించు మంత్రవిదులు
గుత్తకోర్లకు దున్నికొనియెడివారలు
కోపటులై యమ్మికొనెడివారు

గీ॥ సాగుచు వైరులపురములయందు నిలిచి
విభునిచేతను ధన మొంది వేగువారు
చాలసుఖులీలచేఁ బ్రమచరుల కెల్ల
నౌరిపు నాధారరీతుల నుండవలయు ॥ 87

గీ॥ ఇటుల శత్రుపురంబులం దెప్పుడు నిలిచి
యుండు సంస్థలయొద్దను నొక్కచరుఁడు
పరులదేశంబునందుఁ గొందఱను దఱుచు
పలయు విభునకు సవ్వార్తఁ దెలుపుటకును ॥ 88

వ॥ ఇట్లు దేశవార్తలరయం దిరిగెడివారు, సంచారులు, తీక్ష్ణులు, ప్రవ్రజితులు శస్త్రిలు, రసదులు, నసం బరగుచుండుదురు. తత్ప్రకారం బెట్లన్నను 89

## సంచారగూఢచారలక్షణము

సీ॥ అస్త్రఁబెట్టుచు సూళ్ళయందు గ్రాసముఁ జెంది
తీక్ష్ణులు ఠోగులై తిరుగుచుంద్రు
ప్రవ్రజితులపేరఁ బరగెడిచరులు స
న్యాసివేషాదుల నంది యుంద్రు
శస్త్రవైద్యముఁ జేసి చరియింపుచును కొంద
ఱఖిలభూముల శస్త్రి లనెడివారు
రసవైద్యములు చేసి రసికులై తగు చుంద్రు
రసదులపేరింటఁ బొసఁగు వార

వ॥ మఱియు సామంతాధిపతుల దెసయందగు శత్రురాజుల యంతఃపురవార్తలెఱుంగఁజేయు వేగులవారివిధం బెట్లన్నను.

సీ॥ గాసిసేవారలై వడి పసకుంచు
వారిరీతుల మూఁగవానికరణి
మెలఁగువారు నపుంసకులు జటవేషులు
గానుదోయునవారు గంజువవార
లటువంటిరీతుల యాకారములు గల్గు
కాయలు పండ్లమ్ముబోయువారు
చాకలవారు బిచ్చాలవారలు నట్టు
పలు మెఱి శిల్పముల్ గలుగువార

గీ॥ ఇంటి బిడ్డలు బూచంచ లిచ్చువారు
వివిధరాజులయంతఃపురములలోని
వార్త లెల్లను దెలియంగ పలుకు నెపుడు
వేగువారలు గుట్టుగానివిధముతోడ ॥ 95

గీ॥ గాడుగులును గింజ్లు నురటులు గుఱ్ఱములును
బట్టువారలు పల్లకీ ల్మోట్టువారు
నగుచు వేగులవారలు బొగడవార్త
వెలినిఁ గలవార్తఁ దెలుపఁగా వలయుఁ బతికి ॥ 96

సీ॥ వంటలవారలు వైద్యులు తపసులు
జ్యోతిషికుల్ వ్రతుల్ హాస్యపరులు
నాంధ్రవారలు నీళ్ల నందించు వారలు
జెట్టిలు భుజియింపఁ బెట్టువారు

పీడెపుల్ సొమ్ములు విరు లొసంగెడివారు
కలపముల్ గూరిచి యలఁదువారు
సింగారములు సేయు సంగడికాండ్రును
నామతీర్థమువారు సామువారు

గీ॥ నాదియగువారి శత్రులయంద నిలిపి
యింగితాదుల నితరు లెఱుంగనీక
దాయ లెందుసు రసమిడఁ జేయవలయు
నీతిమార్గం దెఱింగిననృపవరుండు ॥ 97

చం॥ పసువడ నింగితాకృతుల భాషల నన్యు లెఱుంగకుండ నే
ర్పున మును బందుకట్టినలిపుల్గల కమ్మలచేత శత్రుప
ర్జనముల నొండొరుల్ గడుఁ దిరంబగురీతి నెఱింగి వేసవా
రసుపుగఁ దెల్పఁగాఁ దగు ధరాధిపవర్యున కాప్తులై తగన్ ॥

చం॥ రవికిరణంబు లెల్లెడల రాజిలి నీరముఁ బీల్చుకైవడిన్
భువిఁ గల వార్త లెల్లఁ దమబుద్ధిబలంబున సంగ్రహింపుచున్
వివరముతో రహస్యగతి వేగులవారు చరింపఁగాఁ దగున్
వివిధములైన వేషములు విద్యలు శిల్పములుం బొసంగఁగన్ ॥

కం॥ ఏరీతి సిరులకౌఱకై
వైరులఁ దా నాక్రమించు వారు నటులనే
చేరి యొనర్చు నుపాయ ము
దారగతిం దెలియ వలయు ధరణీపతికిన్ ॥ 100

శా॥ లక్ష్మీసలయుతనీతివిక్రమకళాలంకార లంకారణా
సూక్ష్మప్రాభవ రామభద్రసుగుణస్తోత్రోల్లసన్మంత్ర మం
త్ర క్ష్మారక్షణదక్ష దక్షవిమతప్రఖ్యాతశౌర్యక్రియా
లక్ష్మప్రస్తుతచార చారవరజాలజ్ఞాతవార్తోజ్వలా ॥ 101

క౦॥ శ్రీ కర్ణాటాధిపద
త్రాకలితసవీనచామరావికస్ఫపచి
హ్నాకల్పవరశుభాంకా!
శ్రీకరమహనీయరూపజితమకరాంకా! ॥ 102

తరలము॥ వినయహార! సనయచార విదిత ధీరమండలీ
వినుతిహార కీర్తిపూర వజిత తారకా శర
ద్వనదవార! పతిత ఘోరవైరి వీరశౌర్య ఖే
లన గభీర గుణవిహార లలితశూర సేవితా ॥ 103

గద్యము॥ ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భార
ద్వాజసగోత్ర జక్కరాజు ఎఱ్ఱనామాత్యపుత్ర సుకవిజన విధేయ
శ్రీరామకృష్ణ భక్తివైభవ భాగధేయ వెంకటనామధేయ ప్రణీతం
బైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు మంత్ర
ప్రభావంబును, దూతచారస్వభావంబు నున్నది పంచమాశ్వాసము.



# ఆంధ్రకామందకము

## షష్ఠాశ్వాసము

కం॥ శ్రీదశరథనృపనందన
పాదాబ్జస్మరణకరణపటుమానస సం
మోదితసజ్జనవిదితన
యాదిక కొండ్రాజువెంకటాద్రినరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### ఉత్సాహప్రశంసా ప్రకరణము

ఉ॥ శ్రీరమణీయుఁడై నృపతిశేఖరుఁ డన్నిట బుద్ధిమంతుఁడై
చారులచర్యచే నెపుడు శత్రులబల్మి యెఱింగి యెంతయుం
గౌరవ మెంచ దూతలసుఖంబునఁ గార్యము గానిపిమ్మటన్
వైరుల ఖేదపెట్టుచు నవారితలీలల దంపు వోఁ డగున్ ॥ 3

కం॥ సమకొను ప్రయత్నమును స
త్త్వము చెందుచు సూక్ష్మధారఁ దగి నిల్కడయై
యమరినమతి ఫలసిద్ధిం
గ్రమమునఁ గను నరణి యగ్నిఁ గనుచందమునన్ ॥ 4

ఉ॥ జేగురుతోలఁ గుందనముఁ జెందినమాడ్కి దధిన్మథించినన్
వేగమె వెన్నపుట్టునరణిన్ వరబుద్ధిసమేతయత్నసం
యోగముగల్గి నిల్కడల నొందుచు నుండెడు నట్టి మంచి యు
ద్యోగముచేత నెల్లపుడు నొందు ఫలంబులు నిశ్చయంబుగన్ ॥

కం॥ అల యుత్సాహము బుద్ధియుఁ
దెలఁగగ సుద్యోగియైనక్షితిపతి యింటన్
బల సిరులరు నిలుకడ యగు
జలములకును టెంకియైన జలనిధివోలెన్ ॥ 6

కం॥ జలములచేఁ దాలితమగు
జలధినిగతి బుద్ధిచేత సంపదఁ బ్రోవన్
బలయును యుత్స్నోత్సాహ
మ్ములచే సది యెపుడు ప్రబలముగఁ జేయఁదగున్ ॥ 7

మ॥ ఇల సుత్సాహగుణంబుసం బొదలి తా నెవ్వేళలన్ బుద్ధిచే
మెలఁగం జాలినయట్టి రాజుపలన న్మెలో సిరుల్ వాసి పో
కలదు న్మెసులతోడ నీడ లెడబాయం జాలకున్నట్టిలీ
లల విస్తారముఁ జెందుచుండు నవి చాల న్నిక్కి పెంపెక్కుచున్ ॥

కం॥ అలయక వ్యసనములకుఁ గడుఁ
దలఁగుచు నుత్సాహమతులఁ దనరెడువిభునిన్
బలుసిరులు తామె చెందున్
జలనిధిలో నదులు చెందుచందం బందన్ ॥ 9

కం॥ జనపతి మతిఁగలిగియు దా
ననిశము వ్యసనములచేత నలసుండైనన్
ధనసిరులు దన్ను విడుచును
వనితలు రేపంబులేనివానిం బోలెన్ ॥ 10

మ॥ ఘనమౌ కట్టియచేత నగ్ని బలియంగాఁ జేయుచందంబునన్
దనయుత్సాహముచేత సత్త్వమభివృద్ధంబై కనం జేయఁగాఁ
జను నిద్ధారుణి నట్లకా విలసితోత్సాహంబు నిత్యంబు జెం
దిన యాదుర్మలుఁడున్ సిరిం గని సముద్దీపించుఁ జంచద్గతిన్ ॥

మ॥ తలఁపన్ సంపద నెల్ల ధూర్తయువ కాంతంబోలె భూజాని ని
చ్చలుఁ దాఁ బౌరుషయుక్తుఁడై యనుభవించంగోరి యత్నంబు భూ
స్థలిఁ జెందం దగు నిట్లుగాక మఱి యుత్సాహంబుతోఁ బాయుచున్
వలదెవ్వేళ నపుంసకుండు బలె నుండంగా మహీభర్తకున్ ॥ 12

కం॥ అందంద ధూర్తయై తగు
మందగమనఁ గూడునట్లు మఱి సిరి దగుఁ బో
యెందు నల సింహవృత్తిన్
ముందల పట్టీడ్చి తెచ్చి ముదమున జెందున్ ॥ 13

చం॥ ధళధళమంచు మించులను దార్కొను సారకిరీటరత్నపం
క్తులఁ దులలేనిచిత్రములతోఁ దగువైరిశిరంబులందు ని
చ్చలుఁ జలమెచ్చఁ బాద మవిషాదముగా నిడనుండెనేని కే
వలవలమానమానసుఁ డవశ్యము దా శుభ మంద నేర్చునే ॥ 14

కం॥ పసగల యుద్యోగముచే
నెసగొలిపెడు చిత్తమనెడియేనుఁగుచే ని
వ్వసుమతిఁ బరులను దరువుల
వెస గడపక నృపతి కెందు విభవము గలదే ॥ 15

చం॥ చెనకినవైరిపైఁ జికిలిచేసిన భాసిలుపెద్దకత్తి దూ
సిన జనియించు చాయలు విచిత్రములై మదహస్తిహస్త భే
లనకరదండయుగ్మమున లావునఁ బట్టినఁ జిక్కుఁగాక మిం
చిన ఘనరాజ్యలక్ష్మి దనచేతికి నూఱక చిక్కఁదక్కునే ॥ 16

ఉ॥ ఉన్నతమై చెలంగు పద మొందఁ దలంచినయట్టివాఁడు దా
నున్నతమై చెలంగు పదమొందుచునుండును, గాక నీచమై
యున్నపదంబుఁ గోరుకొనుచుండెడినీచుఁడు చెందు నీచమై
యున్నపదంబుఁ దాఁ బడుట నొందెడు శంకదొలంక నెల్లచోన్ ॥

మ॥ తనకం బెక్క బొడపై నయేనుఁగులమీఁదన్ విక్రమం బొప్పఁ జెం
గున సింగంబు పదంబుఁ బెట్టుగతి రాజాగ్రేసరుం డెల్ల చోఁ
దన యుత్సాహముచేత విక్రమముచేత న్మించ నత్యున్నతిన్
ఘనమైనట్టిపదంబుఁ గైకొను ధరాకాంతుల్ నుతుల్ సేయఁగన్॥

కం॥ భయమెడలిన పా మొదలకు
భయముగఁ దనపడగఁ జూపు దానునఁ బతియున్
భయమునఁ బొరయనివాఁడై
నయగతిఁ దేజంబుఁ జూప నాయం బెందున్॥ 19

వ॥ ఇది యుత్సాహ ప్రకరణం బింక స్వామ్యాది సప్తాంగంబులకుఁ
గల ప్రయోజనంబులును, వ్యసనంబులునుం గ్రమంబున
వివరించెద నందు రాజప్రయోజన మెట్లనిన. 20

ప్రకృతికర్మ ప్రకరణము — రాజచర్య

సీ॥ విద్యలన్నియు లెస్స విని యర్థము లెఱింగి
పర్ణాశ్రమంబుల పదునఁ బ్రోచి
శస్త్రశాస్త్రంబులచందముల్ గనుఁగొని
యనిసేయునేర్పుల నభ్యసించి
యలవుమై నెపుడు వాహ్యాళి వెళ్ళగ నోపి
కార్యపద్ధతుల సంగతులు దెలిసి
రథములఁ గరులఁ బోరగ నేర్చి యెంతయు
బాహుయుద్ధమురీతి పదిలపఱచి

ఆ॥వె॥ మాయలెఱిఁగి పరుల మనసులు గనుఁగొని
కైదువుల పరీక్షఁ గనఁగఁ జాలి
సకలజనులు మెచ్చ జయపెట్ట మెలఁగుట
రాజచర్యలివి ధరాతలమున॥ 21

సీ॥ మంచివారికి నెల్ల మంచివాఁడగుటయు
　　ధూర్తుల యెడఁ గడు ధూర్తగుటయు
పాపదానంబులచందంబు భేదంబు
　　వంతం బుపేక్షయుఁ దగ నెఱుగుట
మంత్రవిచారంబు మఱవక సేయుట
　　మంత్రమార్గమున సమ్మతి మెలఁగుట
మంత్రంబు రక్షించి మంత్రస్థిరం దౌట
　　దుష్టజనంబుఁ బోఁ దోలుటయును

గీ॥ మఱియు దళవాయు లధికార్లు మంత్రివరు ల
మాత్యులుఁ బురోహితాదులు నిత్యలీల
మెలఁగఁగతు లన్నియును తెన్ను దెలియుటయును
రాజు వరియించుచర్య ధరాతలమున ॥ 22

సీ॥ అరసి యమాత్యాదు లైనట్టి సప్తాంగ
　　మందలివ్యసనంబు లడఁచుటయును
రోషమందినవారి కోపంబు మాన్పుట
　　గురువు చెప్పినబుద్ధిఁ దిరుగుటయును
పూజార్హులగువారిఁ బూజింప నేర్పుట
　　ధర్మాసనము వెట్టి తప్పకుంట
రాజ్యబాధకులను బ్రహరించుటయు బంట్లు
　　జీతముల్ చెందుట చెందకుంట

గీ॥ చేసినవి సేయనివి పరీక్షించి యుంట
యెపుడు పేదరికంబున నైనయువారిఁ
గలిమిగలయట్టివారిని దెలియుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 23

సీ॥ మధ్యమోదాసీనమూసవేశుల మార్గ
మరసి వారల సంధియందుటయును
వచ్చువారిని బోవువారి నెఱుంగుట
హితులఁ గూర్చుట వైరితతి నడఁచుట
యాంధ్ర బిడ్డల లెస్స యరసి రక్షించుట
నలుదిక్కులకును దూతలఁ బనుచుట
తనకు జీవనములై తనరు గనుల్ పసులును
గరులును గృషులాది గాఁగఁ గల్గు

గీ॥ నట్టి వన్నియుఁ జేకూర్చి యలరుటయును
దుష్టులగునట్టివారలఁ ద్రోయుటయును
మంచివారలఁ జేపట్టి మించుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 24

సీ॥ సకలజంతువుల హింసలు చేయకుండుట
యెందు నధర్మంబుఁ జెందమియును
మంచికార్యము లొనరించగాఁ బూనుట
దుష్టవాక్యములెల్లఁ ద్రోచియుంట
యియ్యంగఁ దగుచోట నియ్యంగ నేర్చుట
పుచ్చుకోఁ దగుచోటఁ బుచ్చుకొనుట
దండించఁ దగనిచో దండించకుండుట
దండార్హులగువారిఁ జెందుటయును

గీ॥ దెలియఁ దగినవి తెలియుట, తెలియఁదగని
యర్థములు విడుచుటయు, నిరర్థకముల్లు
మాను టర్థంబుగలయవి పూనుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున॥ 25

సీ॥ అరిఁగోర్ల నెపుడు న్యాయంబుగాఁ గొనుటయు
నెఱిఁగి న్యాయంబుగా నిచ్చుటయును
ఎసప్రధానజనంబు ఘనముగాఁ బ్రోచుట
విడువగాఁ దగువారి విడుచుటయును
వైరంబు లడఁగించి వర్తించుటయు బంట్ల
తోడి విరుద్ధంబుఁ ద్రోయు టెందు
నెఱుఁగకుండిన యర్థ మెఱుఁగఁగా నేర్చుట
యెఱిఁగి యర్థము నిశ్చయించుటయును

గీ॥ సకలకార్యంబులందును జతురుఁడగుచుఁ
బూనిసేయుచు నుండుట, బూనిపట్టి
పనులఁ గడవెళ్ళగాఁ జేసి పరగుటయును
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 26

సీ॥ నీతి మించఁగఁ జెందనిది చెందఁగోరుట
చెందిన దభివృద్ధిచేసికొనుట
యభివృద్ధిచెందినయర్థంబు శాస్త్రోక్త
మగురీతి సత్పాత్రమందు నిడుట
మఱియు నధర్మముల్ మాన్చుట యనునీతి
విడువ కెవ్వేళల నడచు టెందు
నుపకారయోగ్యులై యుండెడువారికి
నుపకారములు సేయుచుండుటయును

గీ॥ ధర్మమెప్పుడు ధనముగా దాఁచికొనుట
యెంచఁదగుఁ గీర్తి మించి వర్తించుటయును
దైవమును బ్రాపు దాపుగాఁ దలఁచికొనుట
రాజు చరియించుచర్య ధరాతలమున ॥ 27

వ॥ అమాత్యప్రయోజనము. 28

మంత్రి చర్య

సీ॥ ఆదాయములు గల్గ హరువుఁ గల్పించుట
యెఱిఁగి వెచ్చంబు సేయించుటయును
పైకొని పగవారి రాకుండఁ జేయుట
క్షితిపతి నెపుడుఁ బోషించుటయును
పంచనీతియును మంత్రంబు నెఱుంగుట
యెఱిఁగి మంత్రఫలంబు నెనయుటయును
వ్యసనముల్ రాకుండ వర్తింప నేర్చుట
యెన్నగాభూమిఁ గాలించుటయును

గీ॥ మీఁదట ఫలంబు గలుగఁ దా మెలఁగి చెలఁగు
టాదిగాఁ గల్గియుండెడునట్టి యెల్ల
మంత్రిజనములపనులంద్రు మహిఁ దలంప
నిట్టి మార్గంబు నరవరుఁ డెఱుఁగవలయు ॥ 29

వ॥ రాష్ట్ర ప్రయోజనము. 30

రాష్ట్ర చర్య

కం॥ బలమును భండారము ధన
ములు వాహనములును ధాన్యములు దృణకాష్ఠం
బులు మొదలగువస్తుతతుల్
గలిగించుట రాష్ట్రమునకుఁ గల పను లరయన్ ॥ 31

వ॥ దుర్గప్రయోజనము. 32

దుర్గచర్య

సీ॥ ఆపద తఱిఁ బ్రజ కాశ్రయంబగుటయు
భండారమున కున్కిపట్టగుటయు

నఖిలదేశంబులయందు నుండెడివార
లేయెడ నిలుకడ నెనయుటయును
బరులకుఁ దోట్లాట బాసిగాకుండుట
ఘనమైనవిజయంబు గనఁగలుగుట
శత్రుల మిత్రుల సమకూర్పఁ గలుగుట
బలముల రక్షింపఁ గలుగుటయును

గీ॥ గడిదొరలచేత మఱి పాలెగాండ్రచేతఁ
బీడఁ బొరయక యెందును బెంపుఁగనుట
మొదలుగాఁగల్గు నివి దుర్గమునకు బసులు
నృపతి యీమార్గముల నెల్ల నెఱుఁగవలయు ॥ 33

వ॥ బలప్రయోజనము. 34

బలచర్య

సీ॥ విమతులఁ జెండాడి విజయంబుఁ గనుటయు
మిత్రులఁజేకూర్చి మెలఁగుటయును
జగతి నెంతేనియు సాధింపఁగలుగుట
ధనముల నార్జించి తనరుటయును
దూరకార్యముల నెందును వేగచేయుట
చెందినదాని రక్షించుకొనుట
నిజబలతతుల నెన్నికమీఱఁ గూర్చుట
పరచక్రములఁ గీడుపఱచకుండు

గీ॥ టాదిగాఁగల్గుచుండెడు నట్టి వెల్ల
ప్రాజ్ఞులగువారు బలములపనులటందు
రిట్టి మార్గంబు లెల్లఁ దా నెఱుఁగవలయు
పితిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 36

వ॥ మిత్రప్రయోజనము. 36

సుహృచ్చర్య

సీ॥ పగవారలను మట్టుపడియుండఁ జేయుట
మంచిమిత్రులఁ బ్రబలించుటయును
భండారములచేత బలములచేతను
క్షితిచేతఁ బ్రాణంబుచేతనైన
నెల నుపహారములే చాలఁ జేయుట
మిగులనెయ్యంబుతో మించుటయును
గణుతింపఁ బ్రత్యుపకారంబుఁ గోరక
మంచికార్యములు సాధించుకొనుట

గీ॥ యాపదలయందు మిగుల సహాయుఁడగుట
సంపదలు చెందియుండిన సంతసిలుట
యరయ మిత్రుని పనులండ్రు ధరణినాథుఁ
డిట్టి రాజ్యాంగముల పనులెఱుఁగవలయు ॥ 37

వ॥ వ్యసనములకు. 38

ప్రకృతి వ్యసనములు

ఆ॥వె॥ ఎందుచేత శుభము లెప్పుడు చెడిపోవు
నదియ తలఁప వ్యసన మనఁగఁ బరగు
వ్యసనియైనవాఁడు వెస నధోగతిఁ బడు
నటులఁగాన వ్యసన మడఁప వలయు ॥ 39

కం॥ దైవంబును మానుషమును
దైవము మానుషము రెండు దగులుటచేఁ సం
భావితమగు వ్యసనము తా
భూవరుఁ డిదిమాన్పి ధంతుపోవఁగ వలయుఁ ॥ 40

కం॥ జలమును దెవులును మారియు
నల దుర్భిక్షంబు చిచ్చు ననునైటు తెలుం
గల వెలయు నెందుదైవిక
ములై నవ్యసనంబు లితరములు మానుషముల్ ॥ 41

కం॥ పౌరుషమున శాంతులచే
సారె విభుఁడు దైవికవ్యసన ముడుపఁ దగున్
బౌరుషముచేత నీతివి
చారముచే మానుషవ్యసన ముడుపఁదగున్ ॥ 42

వ॥ రాజవ్యసనము.

కం॥ అతినిష్ఠురమగుమాటయు
నతిదండము వేఁట పాన మతిపయి జూదం
బతిఘనమగుదుర్వ్యయమును
క్షితి నివి వ్యసనంబు లండ్రు క్షితిపతి కెందున్ ॥ 44

గీ॥ నిరత ముద్యోగవంతుఁడై నీతి నలరు
రాజు రాజ్యాంగముల నెల్లఁ బ్రబలఁజేయు
నటులఁగాకెందు వ్యసనార్తుఁడయ్యె నేని
తనదు రాజ్యాంగములనెల్ల తలఁకఁ జేయు ॥ 45

కం॥ అలధర్మార్థంబుల నా
కులుఁడగుచో మనసు దొట్రుకొని చెదరినచో
విలతేనికి సన్మంతులు
దెలుపఁగేఁదగు రాజచర్య దీరత నొందన్ ॥ 46

వ॥ మంత్రివ్యసనము. 47

కం॥ అలసత జాడ్యము గర్వము
గలహము దెచ్చుట ప్రమాదగతి యుద్ధతియున్
బలుపగు సప్తవ్యసనం
బులు మంత్రుల కెందు వ్యసనములు ధరలోనన్ ॥ 48

కం॥ తనమంత్రిజనము వ్యసనము
గనినయెడ న్విభుఁడు శక్తిఁ గలిగినవాఁడై
యున్న తెక్కులు వితిగిన పులిఁ
గనగాఁ బొడవై నపదవి నందకయుండున్ ॥ 49

వ॥ భండారవ్యసనము. 50

ఉ॥ దూరమునందె యుండుటయు దొంగలచేఁ బడిపోవు టెంతయుం
దీరఁగ వెచ్చపాటు చెడదింటయుఁ బెక్కెసచోట్లపన్కి నిం
డారగగూడబెట్టమి యనాదర భావముతోడ నున్కి భం
డారమునందునుండు వ్యసనమ్ములనన్ ధరణీ తలంబునన్ ॥ 51

కం॥ వసుధన్ భండారమునకు
వ్యసనంబులు చెందెనేని యందన పసులుం
బొసఁగవు గన భండారము
వ్యసనము మాన్పంగవలె నవశ్యము పతికిన్ ॥ 52

కం॥ ధరభండారమె మూలము
నరపతి కని నీతిపరులనంగా వినుటన్
దొర యెప్పుడు భండారము
గరిమ మెయిం బ్రబలుచుండగాఁ జేయఁదగున్ ॥ 53

వ॥ రాష్ట్రవ్యసనము. 54

సీ॥ ఎలుకలు చిల్కలు న్మిడుత లెచ్చగువానలు వానలేమి దొం
గలు ప్రతిమూకలుం జనవు గల్గినవారల బాధ శత్రుమూఁ

కలు బసి చచ్చుటల్ దెవులు గ్రమ్మరి భూపతిచేతిభంగముల్
బలువగు మారిసంటుగకుఁ బట్టుటయున్ వ్యసనంబు భూమిపైన్ ॥

గీ॥ పాశుపాల్యంబు గృషియును బణ్య మనఁగ
బరగువార్తనె ప్రజలెల్లఁ బ్రతుకు చుండ్రు
వారు వ్యసనంబు చెందిన వారు సేయు
పనులుచేకూడ వండ్రు భూపతికి నెందు ॥ 56

వ॥ దుర్గవ్యసనము. 57

కం॥ కసవును గట్టెలు వివసము
బసలేకుండుటయుఁ గోటపడుట యుగ్గడ్తల్
రసములు యంత్రాయుధములు
నెసఁగమి దుర్గమున కెల్ల నివి వ్యసనంబుల్ ॥ 58

కం॥ ధర దుర్గమునకు వ్యసనము
పరగిన దుర్గంబు పనులు వసచెడు నివిలే
కిరవగు దుర్గముగల దొర
యరులకు మిత్రులకుఁ బూజ్యుఁడగు నెవ్వేళన్ ॥ 59

వ॥ బలవ్యసనంబులు. 60

వ॥ మఱియు వ్యసనయుక్తంబులగు బలంబులు పరిక్షిప్తంబును, విమానితంబును, వ్యాధితంబును, దూరాగతంబును, బరిక్షీణంబును, సభూయిష్ఠబలంబును, నవిక్షిప్తంబును, సంతశ్శల్యంబును, భిన్నగర్భంబును, సపసృతంబును, బరిమృష్టంబును మిశ్రంబును, సుపనివిష్టంబును, శూన్యబలంబును, మిత్రవిక్షిప్తంబును, బ్రహతాగ్రజనంబును, సస్వామిసంహితంబును, భిన్నకూటంబును, దుష్పార్ష్ణిగ్రాహంబును, నంధంబును, విచ్ఛిన్నవీవధాసారంబును, నుపరుద్ధంబును, నమానితంబును, శూన్య

మూలంబును, నభృతంబును, బరిశ్రాంతంబును, నవాగతంబును, ప్రతిహాతంబును, స్వవిక్షిప్తంబును, గ్రసద్ధమూలంబును, సస్మృత సంప్రాప్తియు, గళత్రగర్భంబును, నాశాసిర్వేదియు, దూష్య యుక్తంబు ననునివి ముప్పదినాలుగు తెఱంగులై యుండు నందు వ్యసనంబులు పరిహరింపరానివి యిరువది యొక్కటియును, వ్యసనంబులు పరిహరించవచ్చునవి పదమూడునుం గలవు. తత్ప్రకారంబు వివరించెద. 61

## పరిక్షిప్తాది బలలక్షణము

సీ॥ అరిచుట్టుముట్టిన నటుత్రోపఁగానక
చిక్కియుండినఁ బరిక్షిప్తబలము
జనపతిచేఁ దిరస్కారంబు గతుఁజెంది
మదిరోషమంద విమానితంబు
నతిరోగములచేత నలసి యేపనులకు
ననసమర్థమైనచో వ్యాధితంబు
నతిదూరగతిచేత మృతిఁజెందుగతి నా
ధావళి విడుచు దూరాగతంబు

గీ॥ నస్త్రములు తూపులును మును గూలిపోప
క్షీణమై యుండు నల పరిక్షీణ బలము
వ్యసనమును జెంది మడుఁగుచున్నట్టికతనఁ
బతికినప్పటి కనిసేయఁ బనికిరాదు॥ 62

సీ॥ అనిసేయ నిట్టట్టు చనరాక యిఱుకున
మెలఁగఁ గూడని యభూయిష్ఠబలము
బహుదేశముల కడపటమున్గి వేళకుఁ
జేరనేరని యవిక్షిప్తబలము

విషమమూఁకలోన నెంతయు శత్రులుండిన
సదరు సంతశ్శల్య మనుబలంబు
సన్యోన్య కలహంబు నంది యైక్యముగాని
భిన్నగర్భంబను పేరిబలము

గీ॥ నొక్కచోరి ప్రదేశము వ్వల నుండి చేర
సనువుగానక యుండిన నపసృతంబు
వ్యసనమును జెంది ముడుఁగుచున్నట్టి కతనఁ
బతికినప్పటి కనిసేయఁ బనికిరాదు ॥ 63

సీ॥ పిఱికిపంతంబునఁ బెగడెడుదశవాయు
నొనగూడుఁబరిమృష్టమనుబలంబు
విమతసైన్యముగూడి విడిసియుండుటఁజేసి
మించి రానేరని మిశ్రబలము
మునుశత్రుల సమీపములనుండి యేతెంచు
నుపనివిష్టంబన నొప్పుబలము
తరతరంబును గొల్చి తగు ప్రాంతమూఁకలై
శూరత గల్గని శూన్యబలము

గీ॥ సడరి మిత్రసహాయార్థమనిపినట్టి
మిత్రవిక్షిప్తమని మొనమేటి భటులు
చాలఁగూలినఁ బ్రహతాగ్రజనబలంబుఁ
బతికి నప్పటికనిసేయఁ బనికిరాదు ॥ 64

సీ॥ అధిపులతోఁ బాసియాధారమెడలిన
యస్వామిసంహిత మనెడి బలము
నధిపులు గూలిన యప్పు డొండొరులకుఁ
గూటమొందని భిన్నకూటబలము

వెనుక శత్రులచేత వెతఁజెందు దుష్పార్ష్ణి
గ్రాహమను పేరఁగలబలంబు
జగదంబులోన నేచ్చరికెకాఁడెడలిన
నటు ముందుఁ గానని యంధబలము

గీ॥ ధాన్యసంప్రాప్తి చుట్టముల్ దనకు రాక
జడియువిచ్చిన్న వీవధాసారబలము
వ్యసనములయందె మునుఁగుచు న్నట్టికతసఁ
బతికి నప్పటి కనిసేయఁ బనికిరాదు ॥ 65

వ॥ ఇంక వ్యసనంబులు పరిహరించి యనికిం బనికివచ్చు బలంబు
లెవ్వియనిన. 66

బలవ్యసన పరిహార విధానము

సీ॥ రిపులు మార్గము గట్టి నుపరుద్ధ మది పెర
త్రోవ నేతెంచిన దురి మొనర్చు
బహుమాన మొందని బలమమానిత మగు
నది యిచ్చి మన్నించ నని యొనర్చు
నిలువఁగాఁ దావులేనిది శూన్యమూలమౌ
నది తావుగల్పించ నని యొనర్చు
సభృతంబు జీతంబు నందకుండినబలం
బదిజీత మిచ్చిన నని యొనర్చు

గీ॥ నలసి యున్నఁ బరిశ్రాంత మనఁగ బరగు
నలయికలు దీర్చనదియును నని యొనర్చు
నిట్టిబలముల వ్యసనంబు లిటుల మాన్పఁ
బనికి వచ్చును మగుడ భూపాలునకును ॥ 67

సీ॥ అడిగిన నీకున్న నాళ చేవెతఁజెంచు
నాశావిని ర్వేదియనెడి సైన్య
మది యడిగిన దెల్ల నప్పు డొసంగిన
నది బలంబులఁగూర్చి యని యొనర్చు
దూష్యులతోఁగూడ దూష్యయు క్త మటంచు
తద్దూష్యులనువారిఁ దలఁగ ననిచి
యైన నాప్తులు శూరులనువారితోఁ గూర్చి
యనికిఁ బంచిననైన నని యొనర్చు
గీ॥ నధికమగునేర్పు లీరీతి నాత్మనెఱిఁగి
తనకు విజయంబు చేకూడఁ దలఁచెనేని
యిటుల బలముల వ్యసనంబు లెల్లమాన్పఁ
బనికివచ్చును మగుడి భూపాలునకును ॥ 68

కం॥ బలముల వ్యసనము లీగతి
నలవునఁ దా మాన్పఁడేని యందరు పనులున్
గలుగఁగ నేరవు గావున
బలముల వ్యసనములు మాన్చు పతి జయమందున్ ॥ 69

వ॥ ఇంక మిత్ర వ్యసనము. 70

కం॥ ఇల సప్తవ్యసనంబుల
వలనం జనియించునట్టి వ్యసనంబులు పై
రులచే నొచ్చుట దైవము
వలనన్ జెడు టిట్టి మిత్రవ్యసనము లరయన్ ॥ 71

కం॥ మిత్రుఁడు వ్యసనమ్ముఁ బొందిన
మిత్రుఁడు చేకూర్చువనులు మిగులఁగఁ జెడుఁ గా
న్మిత్రుని వ్యసనము మాన్చిన
ధాత్రీపతి యెట్టివేళఁ దా జయమందున్ ॥ 72

గీ॥ ధరణి రాజ్యాంగములయందుఁ దనలు నిట్టి
వ్యసనములు మూన్నఁగాఁ దగు నద నెఱింగి
యటుల మూస్పత మదమున నెనయు భూమి
పాలుఁ డరిరాజుచేఁ బరాభవము నెందు ॥ 73

వ॥ ఇట్లు రాజు మొదలుగాఁ బలుకంబడిన యంగంబులకుఁ బ్రాప్తంబులైన వ్యసనంబులలోన మొదట మొదటఁ జెప్పంబడిన యంగంబుల వ్యసనంబులే గురుతరంబులగుచు నుండుఁ గావున. 74

సప్త వ్యసనవర్గ ప్రకరణము.

కం॥ నరపతి దా వ్యసనంబులఁ
బొరయనిచో రాజ్యమెల్లఁ బోవగ నోపున్
నరపతి వ్యసనము చెందిన
నరయుచు రక్షింప రాజ్య మసమర్థ మగున్ ॥ 75

కం॥ తన సచివుని ప్రజ దుర్గం
బును భండారంబు సైన్యమును జుట్టము నెం
చును వ్యసన మందకుండగ
మనిచిన జనపతి త్రివర్గ మహిమన్ జెందున్ ॥ 76

ఆ॥వె॥ శాస్త్రదృష్టిలేని జననాయకుని నంధుఁ
డనుచు నండ్రు ప్రాజ్ఞులైనవారు
అంతకంటె నంధుఁడగుచదివియును గ
ర్వమున మంచినడక వదలునతఁడు ॥ 77

కం॥ జనపతి యంధుం డగుచో
ననువగు మార్గంబు మంత్రులందింతు రిలన్
మను జదివి మత్తుఁడైనన్
వనతోఁ గూడంగఁ బ్రకృతితతి చెడఁజేయున్ ॥ 78

కం॥ కావున నమాత్యమతమున
సేవలనను మెలఁగి శాస్త్రదృష్టి వెలయఁగా
దా విడువవలయు వ్యసనము
లావల ధర్మార్థహాని యడరక యుండన్ ॥ 79

## సప్తవ్యసనములు

ఉ॥ పలుకుల వెట్టి యర్థములు పారగపైచుట యెక్కు డాజ్ఞనాఁ
గలయవి క్రోధజంబులయి కన్పడుచుండు ధరాతలంబునన్
వెలఁదియు మద్యపానమును వేఁటయు జూదముఁ గామజంబులై
నలువు దలిర్చు నిట్టి వ్యసనంబులు భూపతి మానఁగాఁదగున్ ॥

వ॥ అవి యెట్లనినను తత్ప్రకారంబు గ్రమంబున వివరించెద
వాక్పారుష్యమునకు. 81

కం॥ వెఱపొసఁగి నిరర్థకమై
కఱకరిగలపలుకు బలుకగా దెవ్వరితో
మఱి పగఱను మృదువాక్యమె
మఱవక దనవారిఁజేసి మనఁగా వలయున్ ॥ 82

కం॥ కారణములేకయే వా
క్పారుష్యము వెలయుఁగ్రోధగతిఁ బలికెడు నా
క్రూరునకు వెఱచులోకం
బారయ మిణుగుర్లు చల్లు నగ్నింబోలెన్ ॥ 83

కం॥ కఱగరి బలుకును గైదువ
మెఱయుచుఁ బరమర్మభేదమే చూపినచో
గుఱుతగుఁ బ్రతాపవంతుఁడు
మఱిమఱియును దెరలికెరలి మహిఁ బగఱయగున్ ॥ 84

కం॥ ఇల జనులకుఁ బరుసనగాఁ
బలుకుచు వెఱపింపవలదు పతి తియ్యనిప
ల్కులె పలుకపలయు నటులం
బలికినచోఁ బేదనైనఁ బ్రజ సేవించున్ ॥ 85

కం॥ జగతిన్ దుర్జనసాధక
మగు నాజ్ఞయె దండమనఁగ నగు దండంబున్
దగినయెడఁ జేయఁగాఁ దగుఁ
దగుదండము సేయఁ బతిని ధర నుతియించున్ ॥ 86

మ॥ తెలియ న్వ్యక్తసమైన యాజ్ఞగల ధాత్రీపాలుఁ డెందుం బ్రజన్
దలఁకం జేయుఁ, దలంకుచుండు ప్రజ సంతాపంబుతో వైరులం
గలయుం, దత్ప్రజఁ గూడమించునరి సంఘంబందుచేతన్ క్షయం
బలరం గాపున భూప్రజం దలఁకఁ జేయంగాదు భూజానిన్ ॥

కం॥ ప్రజలను బాలించిన భూ
భుజుఁడు కడుం బ్రబలుచుండు భువి నెల్లపుడున్
ప్రజలు చెడఁ బతియుఁ జెడు నా
ప్రజలు కడుం బ్రబలఁ బతియుఁ బ్రబలుచు నుండున్ ॥ 88

కం॥ ఎంతటి యపరాధుల ప్రా
ణాంతకమగు నాజ్ఞ సేయు టనుచితమగు భూ
కాంతుఁడు రాజ్యముఁ జెఱచిన
హంతనె దండింపఁదగు నయస్థితి మెఱయన్ ॥ 89

వ॥ అర్థదూషణము. 90

కం॥ చెఱుపంగఁ దగినవారలఁ
జెఱిపెదనని కినుకఁ బ్రియముచేసిన నది తా
ధర నర్థదూషణం బనఁ
బరగున్ నీతిజ్ఞులైన ప్రాజ్ఞులచేతన్ ॥ 91

కం॥ కారణములేక కోపము
పేరినగల ధనము వెచ్చపెట్టుట కొఱగా
దారయ నాత్మ హితంబుల
వేరుపుతోఁ గోడునట్టి నృపతికి నెందుఁ ॥ 92

వ॥ మృగయావ్యసనము. 93

సీ॥ వాహనం బెక్కుచో వచ్చిన బడలిక
వాహనంబులఁ బోలి పడిఁబడుటయు
వాహనంబులు దనవై పుస రాక యొం
డొకదిక్కుఁజేర్చఁ జేటొదవు టెంటు
నాఁకట దప్పిచే నలయుట ప్రజలకు
నన్నపానాదిక మమరమియును
జలిగాలి యెండచేఁ గలిగినపీడలు
ప్రతియానములచేతఁ బరగుపీడ

గీ॥ కసపుచే ఔల్లుచే వెండి యిసుకచేతఁ
జెట్లచే గట్లచే ముండ్ల పట్లచేత
వేళ్ళచే నీళ్ళచే నాటవికులచేత
వెలయుపీడలు వ్యసనముల్ వేఁటలందు ॥ 94

కం॥ పుట్టల మిట్టల గుట్టల
పట్టుల మఱి మోటచెట్లపట్టున నెప్పుడుఁ
బెట్టుకొను వెతలు వేఁటఁ
బుట్టెడు వ్యసనంబు లంద్రు బుధు లేచోటన్ ॥ 95

వ॥ మఱియును. 96

సీ॥ కాసల నదులను గట్టుల గుహలందుఁ
బొదలచెంతల దక్కఁ బొంచియుండి
కినుకతోఁ బాళెగాండ్లను దోడి దొరలను
దను గడంగించినఁ దగులువడుట
యెంతయుఁ గినుకతో నెడసియుండెడుఁ దన
బలముచే దాయాదకులముచేతఁ
ద్రోవలఁ గడు మోసపోవుట మఱియును
ద్రోవల భ్రమయుచుఁ దొట్రుపడుట

గీ॥ యాది యనుదోషములు వేఁటలందు నెప్పుడుఁ
బొడము గావున నెప్పుడుఁ బుడమిలోన
వేఁటలాడెడితమకంబు విడువవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 97

చం॥ ఎలుగులు సింగముల్ పులులు నేనుఁగులుం బెనుబాము లాదిగాఁ
గలిగినక్రూరజంతువులు గ్రమ్మ భయమ్ములు మీఱుఁ గారుచి
చ్చులువడిఁ జుట్టికొంటయును జూవుల దిగ్భ్రమ మావహిల్లఁ దా
నలఁగుట వేఁటయందు వ్యసనంబులు రాజున కెంచిచూడఁగన్ ॥

వ॥ వేఁటయందు షడ్గుణములు. 99

చం॥ నిలుకడ గల్గులక్ష్యములు నిల్కడలేక చలించులక్ష్యముల్
బలువిడినేయు, టామము కఫంబును గ్రొవ్వు నడంగిపోవుటల్
మెలఁగెడు వేళలన్ శ్రమము మించకయుండుట, జంతుజాతికిన్
గల భయ రోషముల్ దెలియఁగల్గుట, వేఁటగుణంబులెన్నఁగన్॥ 101

వ॥ ఇట్లయ్యును,

కం॥ ఇలఁ బ్రాణహారకముగై
బలసినదోషములు పెక్కు ప్రాప్తించుటచేఁ
దలఁప మహావ్యసనంబై
పొలుపొందుం గాన వేఁట పోఁదగ దెందున్ ॥ 102

వ॥ అయినను మతి యొక్కతెఱంగైన సాధన మొకటైన యుచిత క్రియలచేతనే వేఁటయందలి మంచి గుణంబులు గలుగుటను నుపాయంబులు గలవు గావునఁ దత్ప్రకారంబు వివరించెద. 103

సీ॥ వేఁటాడగా నిచ్చ విభునకుఁ గల్గినా
దనపురంబునకుఁ బ్రాంతమునఁగల్గు
మలచెంతనైన నేఱులచెంతనైనను
దగి మృగంబుల నెందు దాఁటరాని
యగడితఁజుట్టిరా ననువొంది రమ్యమై
పొదలు మొండులు గల్గు పొదలు లతలు
విషకారణములైన వృక్షబలములేక
జలము బచ్చికబైళ్ళు చాలఁగల్గి

గీ॥ యర్ధయోజన పరిమితంబైన వెళవు
నిడుపు గల్గుచుఁ దగునట్టి యడవి యొకటి
యాప్త తతిచేత నిర్మింప నర్హ మంద్రు
వేఁట లాడెడుకొఱకు భూవిభున కెందు ॥ 104

సీ॥ కప్పుమబ్బుల యొప్పుఁ గప్పుచాయలు గల్గి
పలుచనై కాయలుఁ బండ్లు గల్గి
భుగులు కొల్పెడి తావి పూవుగుత్తులు గల్గి
గుఱుతు పేరెఱుగు ప్రమోఁకులనుగల్గి

భృంగీపసంగీత భంగీతతులు గల్గి
శారికా కీరికా సమితిగల్గి
హరిణీ కలభజాల కరిణీకులము గల్గి
పల్లీమతల్లి కావళులు గల్గి

గీ॥ చాల లోఁతులులేక మొసళ్ళులేక
శోభితములైన కొలఁకుల చోట్లు గల్గి
మిగులఁ జెలఁగెడు వనము నిర్మింపఁజేయ
వలయు నాప్తులచేత భూవల్లభుండు ॥ 105

సీ॥ పోవఁగాఁ గొట్టిన పుట్టలు మిట్టలు
శిలలు మొద్దులు ముండ్లచెట్లు గల్గి
నిండారఁ బూన్చిన నెఱియలు బొఱియలు
గుంటలు గోదముల్ గొబలు గల్గి
పరిఖవెంటనెయంటి పలుదెఱంగుల తీవ
లల్లిబిల్లిగ నిండ నల్లికొనిన
రాజితంబగు వనరాజిచేఁ జుట్టిరాఁ
జెలువొంది వెలిని ద్రిమ్మఁకులును లేక

గీ॥ మిగుల వెడలుపు చదురమై మెఱయునట్టి
భూమియును గల్గి తన శత్రు భూపతులకుఁ
జేరఁగా రాక రమ్యమై చెలఁగు వనము
బాగుసేయించవలయు భూపాలుఁ డెపుడు ॥ 106

వ॥ మఱియు నాటవికతతుల ఘనంబు లెఱుంగఁజాలి తనకు నాప్తులుం గ్లేశాయాస సహిష్ణువులైన జనంబులచేతఁ దద్వనరక్షణంబు సేయింపుచునుండెడి మృగయాధ్యక్షుండైన యతండు వివిధ జాతుల మృగంబులం బట్టితెప్పించి యందు దుష్టమృగంబులైన

వానికి గోళ్ళను గోఱలుసు గొమ్మలుసుం గొట్టించి యుంచు పిడి
పించఁజేయు పలయు నంత. 107

కం॥ ఇతరంబగు పని పుఱుపక
చతురత లిపగల్గి యాప్తజనములతోడన్
బతి ప్రొద్దున వేఁటాడగ
నతి సన్నాహమున వనికి నరుగఁగవలయున్ ॥ 108

కం॥ జనపతి వేఁటాడగఁ ద
ద్వనసీమనుజెందు నట్టితఱి నుండంగాఁ
జను నాప్తబలము ప్రాంతం
బునఁ గడు నాయత్తపాటు పొదలుచునుండన్ ॥ 109

కం॥ అడవుల వేఁటాడంగాఁ
దొడరెడి సద్గుణములెల్ల దొరకుం దొరకున్
బుడమిం గల్పితవనముల
యెడలనె క్రీడించు నిచ్ఛ యెసఁగినచోటన్ ॥ 110

ఆ॥వె॥ వేఁటయందు నిట్టి విధము మంచిది యని
పలుకుదురు ధరిత్రిఁ బ్రాజ్ఞులెల్ల
నటులఁగాక వనికి నవనీశ్వరుండు దా
బోయరీతి వేఁట బోవరాదు ॥ 111

వ॥ జూదమునకు. 112

సీ॥ ఎంత ధనంబైన నిసుమంత సేపులో
పల నాశమౌటయుఁ బరుసదనముఁ
గోప మందుటయుఁ బల్కులచేత జగడంబు
నాయుధంబులచేత నగుఁ గలహము

దబ్బఱలాడుట ధర్మముల్ చెడుటయుఁ
జేయంగఁ దగుపనుల్ సేయలేమి
యుతిలోభ మందుట యార్యుల విడచుట
దుర్జనసంగతి దొరకుటయును

గీ॥ జేటునకుఁ గారణంబులు చేకురుటయు
వైరములు చెందుటయు సిగ్గు వదలుటయును
మొదలుగాఁ గల్గు బహుదోషములను జెందు
హాళి జూదంబు లాడెడి యాతతాయి ॥ 113

సీ॥ కల యర్థములమీఁదఁ గాంక్షలు లేకుండు
టర్థంబు లేనిచో నాశపడుట
సంతోషమును మనస్తాపంబుఁ జలమును
గడుఁ బ్రతిక్షణమందుఁ గలుగుటయును
జలకంబు మొదలుగాఁ గలిగిన దేహర
క్షణములయందు భోగములయందు
నాదర మించుకయైన లేకుండుట
మెలఁగకుండుటచేతఁ గలిగినట్టి

గీ॥ దుర్బలత్వంబుచేఁ జాలఁ దూలుటయును
మంచి శాస్త్రార్థముల నుపేక్షించుటయును
మొదలుగాఁ గల్గు బహు దోషములను జెందు
హాళి జూదంబు లాడెడి యాతతాయి ॥ 114

కం॥ మలమూత్ర నిరోధంబులఁ
గల పీడలు దప్పికొనుటఁ గల పీడలు నాఁ
కలిఁ గొనుటవలనఁ బొడమెడి
యలమటలుం జూదమాడు నతఁడికిఁ జెందుఁ ॥ 115

సీ॥ నలుఁడేల కోల్పడి కులకాంత నడవిలో
వల డించి తా నడబాల యయ్యె
ధర్మజుం డాలిని ధర నోడి యిలనెల్ల
విడచి కంకుండన విరటుఁ గొల్చె
దంతవక్త్రుండును దా బలభద్రుచే
గుఱుతుగా బండ్లూడఁగొట్టఁ బడియెఁ
గుండినపుర మేలుచుండురుక్మివిభుండు
జయము పోనాడి నాశనముఁ జెందె

గీ॥ జూద మాడియె కాదె యీ జూదమెంత
వాని నైనను భ్రమయించు వాసి చెఱచు
జూదము సకలగుణములఁ జూరలాడు
జూద మెంతిటివానికిఁ గాదు ధరను ॥ 116

కం॥ జూద మనర్థముఁ దెచ్చుం
జూదంబున భేద మందుఁ జుట్టఱికంబుల్
జూదమున నెయ్య ముడుగుల్
జూదమె పో కాని దెంచి చూడఁగఁ బతికిల్ ॥ 117

వ॥ స్త్రీవ్యసనానకు. 118

సీ॥ కార్యకాలంబులు గడచిపోవుటయును
నర్థంబు ధర్మంబు నలఁచిచెడుట
యెవ్వేళ నిలువెళ్ళ నెఱుఁగని కతన స
జ్జనులు మంత్రిజనంబు గినియుటయును
ధరణిపైఁ బక్షపాతంబునఁ జేయఁగా
రాని కార్యంబైనఁ బూనుటయును
దాల్మి లేకుండు టెంతయుఁ గోపమందుట
వైరంబు సాహసవర్తనంబు

తే॥ లావిగాఁగఁ గల్గునట్టి దోషము లెల్ల
వెలఁదిపలుక నెపుడుఁ గలుగుచుండు
నటులఁగాన నది మహాదోషయుక్తంబు
విషముఁబోలెఁ దెలిసి విడువవలయు ॥ 119

కం॥ చెలువల మోమును చూచుట
కలవడి పేగిరముచెందు సర్వాత్ములకుం
గల కోర్కులెల్ల జిహ్వన
ములతోఁ గంగూడ నాశముం గనకున్నే ॥ 120

వ॥ పానమునకు. 121

సీ॥ తెలివిలేకుండుట తలమూలు బెగడుట
రక్కుటయును గోక కట్టమియును
గల్లలాడుట లంఘగరిమ వోనాడుట
తలఁపు ప్రజ్ఞయు మతి తలఁగుటయును
బనిలేనితటి వెఱఁబడుట నవ్వుటయును
ప్రాణబాధయును యింద్రియము గనుట
సత్పురుషులతోడిసంగతి వదలుట
దుర్జనసంగతి దొరకుటయును
గీ॥ గడగడ వడంకుటయు జారిపడుట కడు న
నర్థ మొందుట స్త్రీగోష్ఠి యధికమగుట
యాదియగు దుర్గుణంబుల నందుచుండు
మద్యపానంబుఁ దగిలిన మానవుండు ॥ 122

కం॥ పానవ్యసనముఁ జెందిన
మానవుఁ డెచ్చోటనైన మదమున మెలఁగున్
బానమదంబున నెచ్చో
నైన బహిష్కార మొందె యధమతఁ జెందున్ ॥ 123

కం॥ వ్యసనముఁ జేసి యోగీశ్వరుఁ
డగణితమతిశాలి షడ్గుణైశ్వర్యయుతుం
డగు శుక్రుఁడుఁ బానముచేఁ
దగి పదమున శిష్యవరుని దండిగఁ ద్రావెన్ ॥ 124

కం॥ కులమును బలమును వేదం
బులు శాస్త్రంబులును శీలమును సంపదయుం
గలవారైనను బానం
బలపడుటనె చెడరె యాదవాంధకవృష్ణుల్ ॥ 125

కం॥ సిరిఁ బొలియఁగఁజేయు వ్యసనము
లరయంగా నేడుతెఱఁగులై యుండి యెపుడున్
ధర నిది యొక్కటియె నరుఁ
జెఱుచున్మఱి యిన్నిగూడఁ జెఱుచుట యరుదే ॥ 126

కం॥ మగువల నెంతయుఁ దగిలినఁ
దగురీతుల మద్యపాన తత్పరుఁడైనన్
దగు కొంత వేఁట జూదము
మిగులం గిడౌట విడచి మెలఁగఁగవలయున్ ॥ 127

చం॥ తలఁపఁగ మిక్కిలిన్ విషయతత్పరతన్ గలిగించు తెస్పగా
నలవడువేదశాస్త్రముల నన్నిటి జారఁగఁజేయు సద్గుణం
బులను మహత్త్వముం జెఱుచు బుద్ధియుఁ బెద్దతనంబు సంపదన్
జలనము నందఁజేయును వెసన్ వ్యసనంబులు దాఁటఁ శక్యమే ॥

కం॥ వ్యసనములు గలుగు నరపతి
వసుధం బసదొఱఁగు వైరివర్గముచేతన్
వ్యసనములులేని నరపతి
యసదృశగతి మెఱఁగి గెలుచు నరిసంఘములన్ ॥ 129

చ॥ ఇదియిది దీనికిం దగి రహింపు నటంచుసు గోర్కె మీఱఁగా
మది( దలపోసి తాఁ బ్రకృతి మండలి సత్క్రియతోడఁ గూర్చి స
మ్మదమున నీతి రీతులను మానవనాథుఁడు దా మెలంగినన్
పదిలనిగౌరవంబునఁ ద్రివర్గముఁ జెందుఁ బ్రతాపశాలియై ॥ 130

మ॥ అనుపమదాన దానయుతహస్తిలసద్బలవాహచక్రపా
లనపటుసార సారసవిలాసవిలోకన లోకనవ్యస
ద్వినుత విహార హారరుచివిశ్రుతకీర్తినివాస వాసవా
త్యనఘమనోజ్ఞభోగ విభవానిశ బంధురబంధురక్షకా ॥ 131

క॥ దీప్తోత్సాహ మహోజ్జ్వల
సప్తాంగ గుణాగుణజ్ఞ సకలదిగంత
వ్యాప్తప్రతాప వరజల
జాప్తాన్వయరామభూపనాసక్తమతీ ॥ 132

విపులరాజవిరాజితము ॥
చటుల తురంగమ చంక్రమణ క్రమనైస్థ్య విరాజితసారసమో
ద్భటపటహప్రముఖ ధంధణధంధణ దారుణనిస్వన దారితహృ
త్పుట మదశాత్రవ భూప ప్రతాపజ భూరివిభానురభూధరిత
స్ఫుటవలయాచల భూసుతసద్గుణభూషణ నిత్యవిభుత్వయుతా ॥

గద్యము :—— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత
భారద్వాజసగోత్ర జక్కరాజ యెఱ్ఱనామాత్యపుత్ర సుకవిజన
విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ
ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు
నుత్సాహ ప్రభుశక్తియు సప్తాంగప్రయోజనంబులుఁ దద్వ్యసన
నంబులు నన్నది షష్ఠాశ్వాసము. 134

# ఆంధ్ర కామందకము

---

## సప్తమాశ్వాసము

కం॥ శ్రీమదహోబల నృహరి
స్వామిపునస్స్థాపనప్రశస్తజయాంకా
రామపదభక్తి పరవి
ద్యామహా కొండ్రాజు వెంకటాద్రినరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### యాత్రాభియోక్తృ ప్రదర్శన ప్రకరణము

కం॥ వ్యసనము విడిచి త్రిశక్తుల
బొసఁగి జయాకాంక్షియైన భూపతి దనకుం
బసగలతఱిఁ గదలఁగఁదగు
వ్యసనంబులు వొందినట్టి పైపలమీఁదన్ ॥ 3

చం॥ వ్యసనము గల్గియుండు రిపువర్గముమీఁదనె దండు పోవఁగాఁ
దొసఁగనటంచుఁ బల్కుదురు పూర్వు లిట్టిమతంబెకాదు త
ద్వ్యసనము లేకయుండు రిపువర్గముమీఁదటనైనఁ బూని వె
క్కసమగురీతి దండు చనఁగాఁదగుఁ దాను సమర్థుఁడైనచోన్ ॥

కం॥ ఇలతేఁడు శత్రు గెలువం
గలవేళలనైన శత్రుగణముల రాజ్యం
బుల బలిమిఁ జెఱుపనోపం
గలవేళలనైన దండు గదలఁగవలయున్ ॥ 5

ఉ॥ పైరులు పండి పుంజగలపట్టున పైరులసీమమీఁదటన్
హారములుంచు దంతు చనఁబొల్పగు నీగతి దండువెళ్ళుచున్
పైరులు చూరఁబట్టి పరిపంథుల జీవనముల్ హరించినన్
సారబలంబుచేఁ దనరి శత్రుల గెల్చును నిర్భయస్థితిన్ ॥ 6

చం॥ వెనుకటిపైరులం దనదు వెన్కనురాఁ గడు పట్టుపెట్టి పెం
పునఁ బరిపర్యలం దెలిసి ముందరఁగల్గుభయప్రదేశముల్
గనిపలు తెప్పగా నెఱిఁగి కంటకశుద్ధి యొనర్చి రాసుదో
నమునసుమార్గమందుఁ బతి యాత్ర సనందగు నప్రమత్తుఁడై ॥

చం॥ సమసమసచోట్ల గుంటలును జాలఁగ మిట్టలునైనచోట్ల నె
య్యముగలసేన మున్నుగఁ బ్రయాణమువోవుట యొప్పు వైభవ
క్రమములయందుఁ దానెఱుఁక గల్గుచు నార్తుఁడుగాక యన్నపా
నముల సమృద్ధిఁ జెంది జరనంబుగ దండు చనంగఁ జెన్నగున్ ॥

చం॥ జలము పసంబునుం గలుగు చాయనె వేసవి పైరిమీఁదఁ బో
వలయు మదేభముల్ జలమువల్ల ఘటిల్లెడు సౌఖ్యమొందఁగా
జలములు లేకయుండినను సామజపంక్తులకెల్ల వేసవిం
గలుగుచునుండుఁ గుష్ఠములు గాటపుటెండలఁ బుట్టువెట్టుచేన్ ॥

కం॥ ఒక్కయెడ నిలుచునప్పుడు
గక్కసమగు వెట్టనొంచుఁ గరిబృందములన్
మిక్కిలిఁ బ్రయాణముల నిడి
వెక్కసమై నొంపకున్నె వేసవివేళన్ ॥ 10

కం॥ నీరములు లేని వేసవి
సారెకు దురవస్థఁ జెందు జంతువు లెల్లన్
వారణపంక్తుల కైనం
దీరనితాపముల నప్పుడె దేహము లెండున్ ॥ 11

ఉ॥ ఘుమ్మను మించువాసనలు గ్రమ్మ మదమ్ములు గల్గి క్రొమ్ములం
జిమ్ముట నుగ్గునూచములు చేసినగట్టులు గల్గి మీఱి కా
గ్గ్రిమ్ముచుఁ గప్పు మబ్బుగమికప్పులయొప్పులు గల్గుదంతి సం
ఘమ్ములయందెకా ధరణికాంతులరాజ్యభరంబు నిల్చుటల్ ॥ 12

మ॥ అవిచూడన్ జడగొండలో యనఁగ నీలాభ్రంబులో నాఁగ గ
ట్లవియం గొమ్ములఁ జిమ్మనోర్చి మదధారాసారతం దేర్చి ఛా
త్రపులం గోటపులాడనేర్చి తగు సుద్యద్భద్ర నాగేంద్రముల్
భువి రాజ్యాస్పదహేతువైనవి గదా భూపాలకశ్రేణికిన్ ॥ 13

ఉ॥ హారతపోటునేర్పు సముజ్జోకయుఁ గల్గిన మాపటీఁడు పెం
పారఁగ నెక్కి యుక్కునఁగి యాయితపాటున మీఱు వారణం
బేరణమందునైన జవమెచ్చినవాజుల నాలువేలఁ దా
పేరతమించఁ ద్రుంచు విసుతించు సుదంచితసాహసంబునన్ ॥

కం॥ జలముల నడవుల నప్పుల
బలుదిన్నెల సమములైన పట్టుల వడిఁ గో
టలును గడపు వడియేనుం
గులు గలిగిన దొరకు దొరకుఁ గోరిన జయముల్ ॥ 15

కం॥ ఏతెరువు నీళ్ళు గలయది
యేతెరువు పరభయంబు లెనఁగక తగుఁ దా
నాతెరువునఁ జనవలయున్
భూతలపతి బలము శ్రమముఁ బొందకయుండన్ ॥ 16

## దండయాత్రా విధానము

సీ॥ అధిపతి దండెత్తునట్టిచో క్షుద్రశ
త్రుండును వెనుక శత్రువుల రేఁచు
సదియు రంధ్రము గాన నహితులౌవారెల్లఁ
గడు ఘనంబుగఁ జేయఁ గడఁగుచుండుఁ

బతికి ముందఱవచ్చుఫలమున కంటెను
వెనుక శత్రులపోరె ఘనము దెలియ
పవిగాక కొసనియర్థంబుకొఱకునై
చేకొన్నయర్థంబు చెఱుపరాదు

గీ॥ కానఁ దనబల్మి వైరుల ఘనతఁదెలిసి
వెనుక శత్రుల పగమాన్చి విమతుమీఁద
దండు గదలంగవలయు నుద్దండలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 17

సీ॥ తనకుఁ బిఱుంద శాత్రవుఁడున్నచోఁ దన
కతఁడునుళోఁగక యరిగెనేని
వెనుకటి శత్రువు వేగ భేదముచెంది
యలమట నొందించు నటులఁ గానఁ
దనకుఁ బిఱుంద ముందఱఁగల్గు శత్రుల
నడఁపగా నోపినయట్టి శక్తి
గలుగు వేళలను విక్రమయుక్తి చే మించి
ఘనములౌ ఫలములు గలుగనెంచి

గీ॥ తనకు నెలవైనపట్టణంబునకు రక్ష
ణమ్ము గావింపఁదగినబలమ్ము నుంచి
దండు గదలంగవలయు నుద్దండలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 18

సీ॥ అరయంగ నిఱువదియగు సంఖ్యఁ దగుభటుల్
గలుగు చేరువయ వర్గంబటండ్రు
దారుణస్థలి బిట్టిసేరువ కొక్కొక్క
ఘనుఁడైవ సేరువకొనిఁ గూర్చి

పెక్కు చేరువలను బెక్కు చేరువకాండ్లఁ
గలిగిన తన యాప్తబలము నేర్చి
తన పట్టణముఁగాప నొనరింపఁగాఁ దగు
నిటుల నేరుపకాండ్ర నేర్పరించు

గీ॥ బరుల రెండు నభేద్యులై పరగుచుండ్రు
గాన నీరీతి నొనరించి ఘనతమించి
యందు గదలంగవలయు సుద్దండలీల
నీతిమార్గం బెఱింగిన నృపవరుండు ॥ 19

సీ॥ తనకు సహాయమౌ దైవంబుచేత సు
వ్యక్తుఁడై దండెత్తుచుండు రాజు
ముందరికి సహాయ్యమును దాను కార్యంబు
వెనుక శత్రుని రాక యొకయు మండు
యొక్కవేళనె కల్గియుండినఁ బదరక
దళవాయినైనను దనయునైనఁ
దన బలంబులలోనఁ దగినట్టి నాలవ
పాలైన మూఁడవ పాలునైన

గీ॥ బలము నొనఁగూర్చి ముందరి పగఱమీఁదఁ
మునుపుగా నంపి తా నిల్చి వెనుక పగఱ
నడుగఁగాఁజేసి కదలుట యొప్పునండ్రు
దండయాత్రావిధిజ్ఞు లీధరణిలోన ॥ 20

## కోపద్వైవిధ్యము

వ॥ మఱియు నాంతరకోపంబును బాహ్యకోపం బనఁగ రెండు తెఱంగుల కోపంబులు గలవు. వానియందు నాంతరకోపంబ యధికంబగు నటులైనను నయ్యుభయతెఱంగులవారి కోపంబులు వారించి

మఱి యభీష్టంబుల నొనర్చి వారిం దనవెంటఁ దోడ్కొని చన పలయు న య్యాఱుదెఱంగులవారి కోపంబు లెట్టివనిన. 21

సీ॥ సుతమంత్రిహిత పురోహిత నిజవంశజ
సేనాధిపతులు ప్రధానజనము
లంతఃపుర ధాతుణి వీరలందు నొక్కనికోప
మైన నాంతరకోప మనఁగఁబరఁగు
గడిఁగాచువారలు నడవులకడ నుండు
ప్రజలును మఱియెంచ బాహ్యజనము
లరయంగ వీరలయందులో నొక్కని
కోపమైనను బాహ్యకోప మగును

గీ॥ తనకు నాప్తులు చతురులై తగినయట్టి
మంత్రిజనములచేతను మనుజవిభుఁడు
తెలియఁదగు నిట్టికోపముల్ తేటపడఁగ
మించి వారల శాంతిఁ బొందించుకొఱకు ॥ 22

గీ॥ ఎట్టిరీతినిఁ దప్తులై యెడసి పగఱఁ
గూడుకొనిపోవ రటులఁ దత్కోపమడఁప
నమరు సామాదులగు నుపాయములనైనఁ
గట్టుకొని వారి విరిపోటు పెట్టియైన ॥ 23

కం॥ హయములును భటులు చచ్చుట
క్షయమగు దవసంబు జసిఁడి కడు వ్యయమైనన్
వ్యయమగు నిటులన్ క్షయమును
వ్యయమగు పయనంబు మానవలయును బతికిన్ ॥ 24

కం॥ ఫలముఁ బస్యము దనకుం
గలయది వేఁ జేతి కిచ్చుగతి వేగమె తా
గలయది వ్యయప్రయాసము
గలిగినయదియైన దండు గటలఁగవలయుఁ ॥ 25

కం॥ ఏనుఁగులకు నశ్వములకు
మానుసులకు నొప్పిదాఁకి మఱి ఫలసిద్ధిం
గానక నొగిలెడు బనికిం
దా నెందును దండుపోవఁ దగ దధిపతికిఁ ॥ 26

కార్య వ్యసనంబులు

వ॥ తనకుఁ శక్యముగాని వస్తువులమీఁదఁ యత్నముల్ సేయుటల్
దనకుఁ శక్యములైన వస్తువులమీఁదఁ యత్నముల్ మానుటల్
దనకుఁ శక్యములైన వస్తువుల వేళఁ గోరుటల్ మూఁటి నెం
చును గార్యవ్యసనంబులంద్రు నయవేదుల్ మేదినీమండలిఁ ॥

సీ॥ ఓర్పును గరుణయు నోర్పులేకుండుట
దాక్షిణ్యమును గ్రూరతయు భయమ్ము
ఢంబును సిగ్గు దుష్టత్వంబు దైన్యంబు
నతిధార్మికత్వ మహంకృతియును
దనజాతిఁ బుట్టిన జనులఁ గాదనుటయుఁ
జంపుటయు నుపేక్ష నలుపుటయును
బలువగు నెండకుఁ జలికిఁ దా నోర్వక
యుండుట వానకు నోర్వలేమి

గీ॥ యివియు వేళలఁ జేసిన నెందుఁ గార్య
సిద్ధులకు నెల్ల విఘ్నముల్ సేయుచుండు
ననుచు నీతిరహస్యజ్ఞు లంద్రుగాన
వీని ననుచితవేళల విడువవలయు ॥ 28

సప్తవిధ పక్ష లక్షణము

వ॥ మఱియు మైత్రులును, నిజులును, సంబంధులును, భృత్యులును, నాశ్రితులును, గృహీతులును, గార్యజులు ననెడు నేడు దెఱంగుల వార లే పక్షంబనం బరంగుచుండుదు రిట్టి పక్షంబనంగ సహాయు లనం బరగుచునుండు నిట్టి సహాయు లెట్టివారనిన. 29

సీ॥ తన తల్లిదండ్రుల యనుగుసంబంధులె మైత్రు,
లెనసిన ప్రాఁతవారెల్ల నిజులు,
పరవి వియ్యంకులె సంబంధులనుచుండ్రు
భృతికిఁ గొల్చెడువారె భృత్యు లరయ
నాత్మరక్షణమున నాశ్రయించినవార
లాశ్రితు లుపచార మందియుండు
వారు గృహీతులు వసుధఁ గార్యార్థులై
యనువొందువారె కార్యజులు దలఁప

గీ॥ నిటుల నేడుదెఱఁగులౌ నిట్టివారి
పక్షము లటండ్రు ప్రాజ్ఞులై పరగువార
లిందు రాగాపరాగంబు లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 30

వ॥ ఇట్టి సహాయు లనురాగిసహాయులు సద్వృత్తసహాయులు నన రెండు తెఱంగులై యుండుదు రందు ననురాగంబుగల సహాయు లెట్టివారనిన. 31

అనురాగి సహాయలక్షణము

చం॥ అనిశముఁ జేరికొల్చి సుగుణావళిఁ గీర్తనచేసి నిందలన్
వినక తదర్థమై తనరు విశ్రుతయత్నము పల్కు శౌర్యమున్
గని కనుపట్టు దోషములఁ గప్పుచు నుండుట యెందు నెంచఁగా
ననువగు నెయ్యముల్ గలుగునట్టి సహాయునిచిహ్న మిమ్మహిన్।

వ॥ సద్వృత్త సహాయుం డెట్టివాడనిన. 33

సద్వృత్త సహాయలక్షణము

చం॥ కులమున మించి మోహమునఁ గూడక దైన్యములేక విద్యలన్
బలమును సత్యముం గలిగి పాటిలు లోభము డించి బుద్ధిచే
నలరుచు మేలెఱింగి వినయంబు వహించినయట్టిమిత్రుఁడే
చలన నుతించ మంచి తగునవర్తనమొందిన దక్షమై ధరన్ ॥ 34

ఆత్మగుణముల నుద్యోగాదుల శ్రేష్ఠత

గీ॥ త్యాగ ముద్యోగమును ధీరతయును బుద్ధి
నిజము మర్యాద సిగ్గు నింద్రియజయంబుఁ
బ్రౌఢియును గౌరవం బనురాగ మొప్పు
బలము నన ముఖ్యగుణములు పార్థివునకు ॥ 35

శక్తిత్రయ స్వరూపము

సీ॥ సారమౌ నీతిప్రచారం బెఱుంగుట
జగతిలోపల మంత్రశక్తియందు
రాత్మసంపదతోడ నలరినబలము కో
శంబు నెంచఁగఁ బ్రభుశక్తియంద్రు
ఘనమైనయట్టి విక్రమమును బుద్ధియు
సత్త్వంబు నుత్సాహశక్తియంద్రు
నీతిమంతులుగాన నృపవరుం డెల్లచో
నిట్టి త్రిశక్తుల నెనయవలయు
గీ॥ నిట్టులు శక్తిత్రయంబుచే నెనసి యెపుడు
నేర్పుతోడుత వర్తింప నేరకున్న
మించు శత్రుల నెటుల జయించనేర్పుఁ
జెలఁగి పంపద నేరీతిఁ జెందనేర్పు ॥ 36

సీ॥ వ్యసనమందిన దైన్య మందకుండుటయును
ఘనమైన శౌర్యంబుఁ గలుగుటయును
దక్షతయును శీఘ్రతయు మహోత్సాహ సం
పదయంద్రు జగతిలోఁ బ్రాజ్ఞులెల్లఁ
బుట్టగాఁ బుట్టిన బుద్ధియు శాస్త్రంబు
దెలియుటకతమునఁ గలుగుబుద్ధి
పెద్దలసంగతిఁ బెనుపొందుబుద్ధియుఁ
గడు విచారింపఁగాఁ గలుగుబుద్ధి

ఆ॥వె॥ జ్ఞానరూపమంత్రిసంపద యనఁదగు
నిట్టి రీతులెల్ల నెఱుఁగనేర్చి
తనదు రిపులమీఁద దండు పోవఁగాఁదగు
నీతి నెఱిఁగినట్టినృపవరుండు ॥ 37

ఉ॥ అల యుత్సాహము శౌర్య మందుటయుఁ గా
ర్యం బూనుటల్ సేయుటల్
బలువా నిల్కడ పౌరుషంబు ముదముం
బ్రాపించు టారోగ్య ముం
దలపెల్లన్ ఫలసిద్ధిచేఁ దగుటయున్
దైవానుకూల్యం బగున్
దెలివిన్ భూపతి యిట్టివేళల ధరి
త్రిం దండుపోవం దగున్ ॥ 38

కం॥ జనపతి తన భండారం
బనుపమగతి వెంటరా సహాయాదులచే
నను వొంది గెలుచుటకునై
చనఁదగు బలబుద్ధిహీనశత్రువుమీఁదన్ ॥ 39

కం॥ ఈరీతి నీతియుతుఁడై
ఘోరమహాపయుండు దండు వోయినయేనిన్
సారోదారతఁ బారా
వారావృతమైన ధరణివలయం బేలున్ ॥ 10

దండయాత్రాకాల దేశాదులు

చం॥ జలములు పుష్కలగల్గుతటి సామజపంక్తికై దండు పోఁదగున్
జలములు పుష్కలేనితటి సైంధవరాజికి దండుపోఁదగున్
వెలువని జప్ప మంచుఁ గమువెట్టయు లేక చెలంగ నాటిదం
గలయఁగ సర్వసైన్యములు గైకొని భూపతి దండుపోఁదగున్॥

గీ॥ గూబ రాతిరిఁ గాకులఁ గొట్టి నొంచు
కాకి పగలైన గూబల గడిమిఁ జించుఁ
గాన వేళ విచారించి కదలవలయుఁ
గాల మెఱుఁగుచుఁ గదలినఁ గలుగు జయము ॥ 42

ఆ॥వె॥ కుక్కచేత మొసలి చిక్కును దరియందుఁ
గుక్క మొసలిచేతఁ జిక్కు నీట
నటులఁగానఁ దనకు ననువైన చో టొంది
చెలఁగు రాజు కార్యసిద్ధిఁ జెందు ॥ 43

సీ॥ సమములై రసుపట్టు చదరపునేలల
నశ్వముల్ మున్నుగా నరుగవలయు
మిట్టలు గుట్టలు గట్టులు నైనచో
నేనుఁగుల్ మున్నుగా నేఁగవలయుఁ
బొదలును మ్రాఁకులుఁ బొదలెడిచోటులఁ
గాల్బలి మున్నుగాఁ గదలవలయు
జలములు లోఁతుగాఁ గలిగినచోటులఁ
దగిన యోడలమీఁద దాఁటవలయుఁ

గీ॥ జవురములు మిట్టి గుంటలు జలముఁబొదలు
గలుగు నటువంటి నేలల బలముడిందు
నందుచే ముందు చనఁదగు నందుచేతఁ
బోవఁదగు దండయాత్ర మహీవిభుండు ॥ 44

చం॥ జనపతి వానకాలమునఁ జాలఁగ మిట్టలమించు త్రోవలన్
బనుపడ వేసవిన్ సలిలమార్గమునం జన నొప్పు నెందుఁ ద
క్కినయెడ మిశ్రభూములను గేవల దుర్ఘటమైన మార్గముల్
గనుగొని యాత్మసేనకు సుఖంబగు రీతుల దండుపోఁ దగున్ ॥

కం॥ జలములు కడుఁ గలత్రోవన్
జలములు లేనట్టి త్రోవఁ జనర సుఖగతిన్
నెలవరులఁ గూడి చనఁదగు
గలయం గట్టియలుఁ గసవు గలిగినత్రోవన్ ॥ 46

ఉ॥ తన చుట్టంబుల యూఁర రాకడలచే ధాన్యాదిక ప్రాప్తిచే
నసువై పిళ్ళఁజెలంగి నమ్మికల లోనై యుండు తన్మార్గ భూ
జనముల్ గల్గినత్రోవఁ బోవఁదగు నెంచం దీనుఁడై భంగముం
గని వీఁకల్ చెడి వచ్చుత్రోవఁ జనఁగాఁ గాదెందు భూభర్తకున్ ॥

చం॥ తెలియక దూరమైన రిపుదేశము వేగిరపాటు మీఱఁగాఁ
జలమునఁ జొచ్చిపోవు దొర సంగరరంగమునందు వైరిభూ
తలపతి ఖడ్గధారల విదారితుఁడై బహు రక్తధారలం
గలగొని పొక్కియుక్కుచెడి గ్రక్కుననూరకె చిక్కిస్రుక్కఁడే ॥

వ॥ ఇట్లుపాయంబులఁ జెందని యుపాయంబులం బయనంబులు
గదలివచ్చి సైన్యంబులు విడియింపందగు నచట మఱియును. 49

చం॥ అరులకుఁ జాలరానియటు లాత్మబలంబుల నిల్పి రక్షణం
బరయుచు నీతిరీతిఁ దగి యాప్తులు శూరులునైన యోధులె

చ్చరికెలఁ జుట్టియుండగ నిశాసమయంబుల యోగనిద్రలం
బొరయుచు నుండగాఁ దగును భూపతియెందును జాగరూకుఁడై ॥

చం॥ కలయఁగఁ జాలి రొప్పు కరిఘంటలగల్లు ఘణంఘణ ధ్వనుల్
మెలఁకువఁజెంది సప్తిముల మించిన హేషిత ఘాంకృతిధ్వనుల్
నిలువడఁగాంచు యోధతతి నిశ్చలవాక్య డిమండిమ ధ్వనుల్
నెలకొని వీనులంటఁ బతి నిద్దురనందున మేల్కొనై తగన్ ॥

చం॥ నెదురతతి. సప్పటప్పటి
కవి యెప్పఁడు మేలుకన్న యతఁడని పతి దా
నదయుఁడయి యాదరింపుచుఁ
బదిలంబని యెచ్చరించి పలుచఁగవలయున్ ॥ 52

వ॥ అంత. 53

దండయాత్రా సమయముల రాజవైఖరి

చం॥ తెలతెల వేగలేచి నరదేవశిఖామణి నామతీర్థమై
కల కులదైవముం గొలిచి ఘమ్మను కస్తురి తావి తీవితోఁ
జిలుకుదళుక్కున న్మెనుచు దాల్చును రత్న విభూష జాళితోఁ
గొలువుకు వచ్చుటొప్పు నిరుగోవులగట్టిన వారహోయనన్ ॥

సీ॥ శ్రీమంతులై మించు సామంతు లొకవంక
నుచితమంత్రులు మంత్రు లొక్కవంక
హితచర్యులగు పురోహితవర్యు లొకవంక
నుదిత సత్యు లమాత్యు లొక్కవంక
ఫలదాయులైనట్టి దళవాయు లొకవంక
నుక్కు నిక్కిన శూరు లొక్కవంక
నధికారుల జ్ఞంభించు నధికారు లొకవంక
నుచిత మిత్రుల మిత్రు లొక్కవంక

గీ॥ సౌక్యపంతఁ గళావతు లౌక్యవంకఁ
జాపరగ్రాహిణులు గూఢచరులు గొలువఁ
దన ప్రతాపంబుఁ బాఠకజనము వొగడ
నింపుమేడుకఁ గొలువున నుండవలయు ॥ 55

కం॥ ఆయెడ జగతీనాథుం
డాయతమతి మెఱయ మంత్రులను వారలతోఁ
జేయఁదగు సట్టిపనులు న
పాయంబులు నిశ్చయించి పతి గదలఁ దగుఁ ॥ 56

చం॥ అలఘుని వేగముం గల హయంబులనెక్కి తనంత వేచి వా
రలు బలుకైదువుల్ నిజకరంబులఁ దాలిచి వెంటఁగొల్వఁ బ
జ్జల నపథాన మెచ్చరికె సాము యహోయని పూని సాహిణుల్
గొలువఁగఁ దేజినెక్కి నృపకుంజరుఁడంతట యాత్రపోఁదగుఁ॥

మ॥ తనయంతేననృపాలశేఖరులు మైత్రస్నేహసన్నాహముల్
వసరం దేపులనెక్కి యుక్కుపొడిదాలఁ గొల్వఁగా సాహిణుల్
వెనువెంటన్ జతనం బహోయనుచు సేవింపన్ గడున్మించి చ
క్కని సామ్రాణిపతాణినెక్కి కదలంగా నొప్పు రాజెయ్యెడన్॥

శా॥ రాజేంద్రుండు గజాశ్వసంఘములచర్యల్లన్నొనంగా జనున్
గైజీతంబును గూట మేర్పఱచి వేడ్కం గానఁగాఁ జెల్వగున్
దేజం బాయితపాటునుం గడుఁ బ్రసిద్ధిం జెందియున్నట్టి బ
త్తేజీలం గజపఙ్క్తిఁ జూడఁదగు హాళిన్ రేపులన్మాపులన్॥

## సర్వావర్జనోపాయము

మ॥ సులభుంటౌ పొడగాన్పుగల్గి దయచేఁ జూపట్టి మందస్మితం
బులఁ జెన్నొందిన పల్కుచేఁ దగఁ బ్రియంబుల్మాటికిం బల్కఁగా

వలయుం జీతముకంటె నెక్కుడుగ నిర్వక్రంబుగా నియ్యఁగా
వలయుం బ్రాణము లిత్తురీ విహితమౌ వాక్యంబుచేతన్ భటుల్॥

ఉ॥ కరుల రథంబులందుఁ దురగంబులయందు వలయోధులందుఁ దా
నరుగఁగ నేర్చి వింట నెరయం జతురత్వముఁ జెంది కార్యముల్
నిరతము నభ్యసింపఁదగు నేర్పున నీగతి నభ్యసింప దు
ష్కరమగు కార్యమైనను సుఖంబునఁ జెందు నరేంద్రుఁ డున్నతిన్॥

మ॥ కడు సన్నాహముగల్గు సేన లిటువంటం గొల్వ సన్నాహముం
బొడవుం గల్గు గజంబు నెక్కి రిపులౌ భూపాలకు ల్వంప వెం
బడి సేతెంచిన మాతతో భటతతుల్ పై మాటుగా నుండ నె
క్కుడు నేర్పొంచెడు మంచివాక్యముల పెక్కుల్మిఁ బోవందగున్

గీ॥ బుద్ధిచే గుణములచేతఁ బొదలు సూత
చారిజనములచే సూతజనముచేత
వైరిచర్యలు దెలిసి కోపలయు వారు
లేనిపతి యెందును గన్నులు లేనివాఁడు॥ 63

చం॥ ఘనత దలిర్ప శత్రు గడిఁగాచుదొరం దన మిత్రుఁ జేసికోఁ
జనునవు డించుకించుక యొసంగుచు నాశలు వాలఁ జూపియై
నను మఱి బేరమాడు నెడ న్యాయము దప్పక వైరి భూములం
బనుపడి వచ్చునెట్లు పరిపాలన మొప్పఁగ మెల్పఁగాఁదగున్॥

చం॥ అనువగు దూతఁ బంపి తనయందిన కార్యము సంధిచేతఁ జ
య్యన నొనరింపఁగావలయు నట్లొనరించిన సంధిగానిచో
దనరుచుఁ గార్యభేదమగు దాన నభేదము చెంది వారిలోఁ
గినుకలు బుట్టుచుండు నది కేవలముం బతికిన్ శుభంబగున్॥

చం॥ అడవులయందు దుర్గములయందు వసించినవారిఁ ద్రోవలుం
గనులును గాచువారల ఘనంబగు సామముచేత నీగిచే

గపుఁడెవినియించి మించి తన కైవసమై తగఁ జేసికోఁడగుఁ
విడుపక శత్రుభూములకు వీరలె త్రోవలు చూపఁజాలుటన్ ॥

ఉ॥ కారణ మొందియైన మఱి కారణమేమియు లేకయైననున్
వైరులయొద్దివారు తనవద్దకు వచ్చిన నాత్మసేవకుల్
వైరులఁ గొల్చియుండి తనవద్దకుఁ గ్రమ్మర వచ్చియున్న ధా
త్రీరమణుండు వారలచరిత్రలు లెస్స నెఱుంగఁగాఁ దగున్ ॥ 67

గీ॥ పటలపై నెత్తుపతి మంత్రబలము చాలఁ
జెంది మున్నె విచారంబు సేయవలయు
బాహుబలమునకన్నను బలిమి మంత్ర
బలము దానని యింద్రుండు గెలిచె రిపుల ॥ 68

కం॥ మేలగుమతిచే సిరికై
కాలంబునఁ జెందవలయుఁ గార్యం బెపుడున్
గాలం బెడలినకార్యము
వాలాయము పచ్చుఫల మవశ్యము చెఱచున్ ॥ 69

చం॥ అలరుప్రభావముం గలిగి యంచితకార్యములందు దక్షుఁడై
మెలఁగుచు మంత్రమార్గమున మెల్కువ చాలఁగఁ జెందియున్నతిం
జెలఁగెడు ధారుణీధవులచేష్టల సద్భుజదండమండలిన్
నిలుకడఁజెంది యెల్లపుడు నిల్చును దైవకళల్ ధరిత్రియున్ ॥

గీ॥ ఆమని చెలఁగుఁ గార్తికమందునైన
జ్యేష్ఠయును మూలకార్తెయుఁ జెందువేళ
నైన మఱి చైత్రమాసంబునందునైన
దండువెడలుట తగునంద్రు ధరణిపతికి ॥ 71

కం॥ ఈరీతిఁ బగఱమీఁదటి
నారూఢిఁ దండువెడలి యల నీతివిధిన్
ఘోరమణుఁడు వర్తించిన
వైరిసమూహముల గెలిచి వర్తిలునెంతున్ ॥ 72

## స్కంధావార నివేశనప్రకరణము

కం॥ బలిమిం బనయరిపురిచెం
తలనుం జని విడియఁదగినతావున విడియన్
వలయును బాళెముదిగునే
ర్పులుగలిగిన రాజు శత్రుభూపతులఫరన్ ॥ 73

సీ॥ నాల్గువాకిళ్ళచే నలువొంది చౌకమై
ఘనమును కొంచెంబుఁగాక పసరి
యగడితలనుకోట నట్టిళ్ళఁ జెలువొంది
విరువులౌ వీథుల వినుతికెక్కి
యర్ధచంద్రునిరీతి నైనను మఱియును
జతురశ్రమైయుండు సరణినైన
నిడివిగానైనను గడు వట్రువుగనైన
నాలోనఁ గల భూమియను వెఱింగి

గీ॥ విమతపురిచెంతఁ బాళెంబు విడియుచోట
మించు *నౌకయగారంబు నిర్మించవలయు
సాధువులు మెచ్చ నచట నెచ్చరికె తెచ్చ
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 74

సీ॥ కోటలో బలము దాకొన విడియింపుచోఁ
గోటకు జలమున్న చోటునకును
గలుగునందున వీధి కోలగోల మాత్రంబు
విడిచి యచ్చట బై బాళకట నిండి

---

* నౌక్యాయరాజు.

కౌనియుండి చాలమించినపార్శ్వములు గల్గి
రక్షితం బగుచును గక్షపుటము
సుపున మూలలై యట సూర్యసోమవీ
థులు విపులుగాఁగ నలరఁజేసి

గీ॥ వాస్తుశాస్త్రక్రమంబుల వైపు దెలిసి
విమతపురిచెంతఁ బాళెంబు విడియుచోట
నెట్లు బలముల విడియించ నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 75

కం॥ పాళెమునడుచక్కి మహా
మూలబలము చుట్టుఁగలిగి ముందఱ నడుమఁ
మేలిమియగుభండారము
చాలఁగలుగు నగ రొనర్పఁ జను నెచ్చోటన్ ॥ 76

కం॥ ఇలతేఁడు నగరిచుట్టును
బలియించఁగవలయుఁ బ్రాఁతప్రజఁ గైజీత
మ్ములఁగూటము మిత్రబల
మ్ముల శత్రుబలంబు నడవిమూఁకను వరుసన్ ॥ 77

వ॥ తత్క్రమంబు. 78

సీ॥ నరనాథమణి తననగరికిఁ జుట్టును
మునుముున్నుగాఁ బ్రాఁతమూఁక నిల్పి
యాతరువాతఁ గైజీతంబు విడిపించి
యాకడఁ గూటపుమూఁక నిల్పి
యావల మిత్రసైన్యంబుల విడియించి
దానియవ్వల శత్రుసేన నిల్పి
యందున కవ్వల నడవిమూఁకల నిల్పి
యావల జీతంబు లంది కొల్చి

గీ॥ తొలుతఁ బనులకువచ్చి యాప్తులను గ్రాహు
లనుచుఁ గుక్కలు గలిగినయట్టి వేఁట
కాండ్రు చుట్టును విడియింపఁగా వలయును
గ్రహము దప్పక నీతివిక్రమము మెఱయ॥ 79

రాజాభిరక్షణకై సైన్యావసానము

ఆ॥వె॥ అధిపు నగరిచేరువందు నుండఁగఁదగు
నాప్తరక్షితంబు లగుచుఁ దనరి
పేరు గలిగినట్టి పెద్దయేనుంగులు
నధిక జవముగల్గునశ్వములును॥ 80

కం॥ అంతఃపురపరిచారకు
లెంతయుఁ దమి విచ్చుఁగత్తు లేమఱక మహీ
కాంతుని గావఁగవలయును
సంతతమును జాలిరొప్ప నస్త్రహననునన్॥ 81

కం॥ మేటియగు నాప్తుఁ డెక్కిన
పోటేనుఁగు జవము కలిమిఁ బొలిచిన హయముఁ
బాటించి నగరివాకిటి
చోటనె యెపు డుండవలయు జోక చెలంగన్॥ 82

కం॥ దళవాయి మున్నుగాఁగల
బలమం దొక కొంత యేరుపడి యత్నముతో
వెలుపటఁ జుట్టును దిరుగఁగా
వలయును రేలందుఁ గడు నవారితశక్తిన్॥ 83

కం॥ వేగము బలమును గలిగిన
వేగులవా రెల్లవేళ విమతులచర్యల్
బాగుగఁ దెలియుచుఁ దా మతి
వేగమె రాఁబోవవలయు విభునకుఁ దెలుపన్॥ 84

చం॥ వెలుపల ప్రాఁతి ప్రాకారయుగావలదండలు గట్టిన తోరణంబులుం
బలుపగు దంచనంబులును బాణము లాదిగఁగల్గు యంత్రముల్
వెలుఁగను బెక్కుముల్ గలుగు ద్వారము లాప్తులఁ గావఁజేయఁగా
వలయు నృపాలశేఖరుఁ డవారితపూరితకీర్తిసారుఁడై ॥ 85

## జాగ్రదవస్థిత్యావశ్యకత

కం॥ పోవుచు వచ్చుచు వాకిటి
కావలివారలకు నెఱుకఁగా సకలజనుల్
పోవలయు వైరిదూతలు
ఘావిభుననుమతినె యుండి పోవఁగ వలయున్ ॥ 86

గీ॥ రిత్తకోలాహలంబులు రిత్తహాస్య
ములును జూదంబులును బానములును మాని
సపరణల మించి యుత్సాహసహితు లగుచు
బలము లెవ్వేళఁ గనుగల్గి పరగవలయు ॥ 87

కం॥ వనకోటకు వెలుపలిదెసఁ
దనబలము చరించుభూమిఁ దడవక వైరుల్
మొనసి చరియించుభూములె
జనపతి చరియింపవలయుఁ జతురుం డగుచున్ ॥ 88

వ॥ అది యెట్లన్నను. 89

## కంటకాదిభూదూషణము

కం॥ ఒక్కొక యెడఁబడు పాఁతర
లొక్కయెడఁ ముండ్లకంప లొకయెడ ముల్కుల్
మిక్కిలి గలిగించి రిపుల్
త్రొక్కుడి చోఁజెల్లఁ జెఱుప ద్రొక్కొనవలయున్ ॥ 90

కం॥ తన బలములు మెలఁగుటకై
తనబడిపనివారిచేతఁ దరువులు బుట్టన్
ఘనమగు మొద్దులు శిలలుఁగా
గనుపట్టకయుండఁ జదుము గావింపఁదగున్ ॥ 91

వ॥ అందు నుత్తమమధ్యమాధమ భూములు వివరించెదు. 92

ఉత్తమాది భూభేదములు

సీ॥ తనమనుష్యులకు నెంతయు మెలఁగావచ్చి
వైరిమూఁకలకు రావైవుగాని
దేశ ముత్తమమగు దేశంబు మఱియును
బగఱకుఁ దన కొక్కభంగియైన
దేశంబు మధ్యమదేశమై చెలువొందు
వైరిమూఁకలకు రావచ్చియుండి
తనమూఁకకెల్ల నెంతయుఁ బోవఁగారాని
దేశంబె యధమప్రదేశ మటులఁ

గీ॥ గనుక నుత్తమదేశంబె తనకు వలయు
నది దొరకకున్న మధ్యమమైన దైన
వలయు నదిగాక చెఱసాలవంటిదైన
యధమదేశంబు వలదు ధరాధిపతికి ॥ 93

వ॥ మఱియు నపజయసూచక ప్రకారంబు లెట్లన్నను. 94

నిమిత్తజ్ఞానప్రకరణము - అపజయసూచక నిమిత్తములు

సీ॥ గ్రహములోఁకిన లీలఁ గళవళ మొందుట
దేవులచేఁ బీడలఁ దవులుటయును
గారణంబులులేక కడుభీతి నొందుట
మంచును దుమ్మును ముంచుకొనుట

కటుఘోరమ్మై దొడ్డగాలి పైకొనుటయు
నూరదె పెక్కెంబు లుర్విఁబడుట
తపలోనఁ దపుకు ద్రోహములు గల్గుటయును
వాద్యముల్ లెస్సఁగా వాఁగమియును

గీ॥ మిగుల పుదిలోన నూరక దిగులుపడుట
నేల యుఱుము చుక్కలు రాలుటయును
దొంగలు మంటలు గత్తులఁ బొడముటయును
గలుగు పాశెంబు విజయంబు గానదంద్రు ॥ 95

సీ॥ పాల దాపట సక్క లూఁగెట్టుటయును
ఘనమైనతాపంబు గలుగుటయును
ప్రాఁకులపైనుండి పూఁకలుగా వచ్చి
కాకులు గ్రద్దలు గ్రమ్ముకొనుట
ద్రమ్మకో రాజనక్షత్రంబులందును
గ్రహరగ్రహంబులు గూడుటయును
గారణంబేమియుఁ గలుగక మద మింకి
యేనుఁగుల్ గదలక గ్రమానుపడుట

గీ॥ తురగచయములు గదలక తొట్రుకొనుట
సూర్యనందను మొండెముల్ చూడఁబడుట
నెరసి నెత్తురువానలుఁ గురియుటయును
గలుగుపాశెంబు విజయంబుఁ గానదంద్రు ॥ 96

వ॥ మఱియును జయసూచకంబు లెట్లన్నను. 97

విజయసూచక నిమిత్తములు

సీ॥ తేజీలసకిలింత లోజమై చెలఁగుట
కాంతలుఁ బురుషులు సంతసిలుట
భేరీరవంబు గంభీరమై యుండుట
కరిబృంహితంబు లగ్గలము లగుట

పుణ్యాహమంత్రముల్ పొలుపు వహించుటి
పాటలు నాటలుఁ బ్రబలు చెంద
ఈతిబాధలులేక యింపొంది యుండుట
సంతతోత్సాహముల్ సంఘటిలుట

గీ|| సారె జనులెల్ల విజయంబు గోరుటయును
వాన లటుగల్గి ధూళిచే నూసకుంట
గ్రహము లనుకూలగతులను గాంచుటయును
గలుగుపాశెంబు విజయంబుఁ గను నటంద్రు || 98

సీ|| మెల్లనితావులఁ జల్లగాడ్పులుగల్గి
సంతోషములఁజెంది జనులుగల్గి
పక్షిజాతులమంచిపల్కులు వినఁగల్గి
చెలఁగుచునుండు మిత్రులునుగల్గి
వందిమాగధశుభవాక్యచాతురిగల్గి
వలఁగొనుశిఖల వహ్నులఁజెలంగి
మదధారల నెసంగు మాతంగములుగల్గి
వలపట నక్కకూఁతలును గల్గి

ఆ|| వె|| యలర నెందు దివిని నంతరిక్షమునందు
నవనితలమునందు నద్భుతముగ
నురక పొడమునట్టి యుత్పాతములులేక
వెలయుపాశెమునకుఁ గలుగుజయము || 99

కం|| పాశెంబున కపశకునమొ
చాలంగాఁ గలిగెనేని జయములు దొలఁగున్
పాశెమున మంచిశకునమొ
చాలంగాఁ గల్గెనేని జయముం గలుగున్ || 100

కం॥ ఇలలోపల శకునంబులె
తెలుపును జయ మపజయంబుఁ దేటపడంగా
నిలఁజేఁ దటుగన శాస్త్రము
తెలివిన్ శకునంబులెల్లఁ దెలియఁగవలయున్ ॥ 101

కం॥ మునుమున్ను పంచిశకునము
లనుపుంగని విపులచిత్తుఁ డగుపురుషుఁడు పూ
నినకార్యము సఫలం బగు
ననుచుం బలుకుదురు ప్రాజ్ఞు లనఘవా రెందున్ ॥ 102

కం॥ బలమును దైవబలంబును
నలప్రజ్ఞయు నిశ్చయంబు యత్నమును సహా
యులకలిమి నెట్టివానికి
గలుగున్ ధరనట్టివాఁడు కడు జయ మందున్ ॥ 103

గీ॥ దినపు దివసంబు నీళ్ళను గట్టియలును
జేకురకయుంట చుట్టముల్ రాకయుంట
రేలు బగలును లాచి కగ్గోలు వడుట,
విపదులకు మృత్యువగు వీని విడువవలయు ॥ 104

కం॥ ఈరీతి దండు విడియుచు
సారె శుభాశుభము లిచ్చ్ఛకున స్థితులుం
దారెఱుఁగవలయు నృపతులు
వైరులయశుభములు దెలియవలయున్ వరుసన్ ॥ 105

## ఉపాయ వికల్ప ప్రకరణము

కం॥ ధృతి యుద్యోగము సత్త్వం
బతులితమతి దేవతాసహాయత గలభూ
పతి సర్వోపాయంబుల
గతు లెఱుఁగుచుఁ బూనుపవలయు గడిఁదిరిపులపైన్ ॥ 106

కం॥ చతురంగబలముకంటెను
ప్రతిభందగు మంత్రబలము భండారము సం
స్తుతిమించుఁ గాన వీననె
యతులితగతి గెలువవలయు నహితుల నెల్లన్ ॥ 107

## సప్తవిధోపాయములు

కం॥ ఇలలోన సామదానం
బులు భేదము మఱియు దండమును మాయోపే
క్షలు నింద్రజాలమనఁగాఁ
గలిగిన యీయేడుపాయగతు లండ్రు బుధుల్ ॥ 108

వ॥ అవియెట్లన్నను తత్ప్రకారంబు క్రమంబున వివరించెద. 109

## సామ స్వరూపము

సీ॥ మునుపుగాఁ బ్రియమున మ్రొక్కి లోనర్చుట
పెద్దలనుగుణముల్ పేర్కొనుట
వారిసత్కార్యముల్ వరుసతో నెన్నుట
తొలుతటి సంబంధములు దెలుపుట
తమకుఁ జుట్టఱికంబుఁ దానె కల్పించుట
యిరువురయుపకార మెన్నికొనుట
యన్యోన్యగుణముల నందందఁ బొగడుట
మీఁదటిఫలములఁ దాఁ దెలుపుట

గీ॥ మంచితనమునఁ గల్పుకోల్మాట లాడి
యేను నీవాఁడ నని తను నిచ్చికొనుట
యివియె సామప్రకారంబు లిట్టి వెల్ల
దెలియఁగలరాజు చేకొనఁ దెలియఁ దలఁచు ॥ 110

## పంచవిధ సామప్రకారములు

వ॥ ఇట్టి సామప్రకారంబు లన్నియునుం గూడి యైదు విధంబులై యుండు నది యెట్లన్నను పరస్పరోపకార ప్రదర్శనంబును, బరస్పరగుణకీర్తనంబును, బరస్పర సంబంధకథనంబును, సుత్తమ కాలఫలప్రదర్శనంబును, నేను నీవాఁడనని తను నిచ్చుకొనుట యుంగా, మఱియు నది ప్రయోగించు తెఱంగెట్లన్నను. 111

## సామప్రయోగవిధానము

గీ॥ ఎలమి నిరువుర యుపకార మెంచి మించు
గుణముఁగొనియాడి సంబంధగణన సేసి
మీఁదటిఫలంబు గనఁబల్కి మీకు నేను
వగు లటనుచును సామోక్తిఁ బలుకవలయు॥ 112

గీ॥ అరసి బహుమాన మొనరించు నట్టికరణి
నాదరంబునఁ గనుఁగొనునట్టి సరణి
నమృతకణములు చిలుకుచున్నట్లు నేర్పు
కులుకుచుండఁగ సామంబుఁ బలుకవలయు॥ 113

కం॥ సామంబుగ నిజ మాడుట
ప్రేమం గొనియాడుటయును బ్రియ మాడుటయుం
దా మఱి ప్రార్థన సేయుట
యీమార్గము మనుజపతుల కెఱుఁగగవలయున్॥ 114

కం॥ నేమమునఁ గార్యసిద్ధికి
సామమె యొనర్పింపవలయు సకలమ్ముగునెడన్
సామమునఁ గార్య మగు నని
ధీమంతులు సంతతంబుఁ దెలిపెడుకతనన్॥ 115

కం॥ సురలసురులు మును సామ
స్ఫురణఁ గా శరనిధి మథించి శుభ మొందిరిలన్
ద్వరితమున సామ మొల్లక
కురురాజకుమారు లవనిఁ గూలరె జడులై ॥ 116

వ॥ సామసాధ్యులవు. 117

సీ॥ అలసుని శౌర్యము దలఁగినవానిని
గడుసుపాయంబులు చెడినవాని
క్షయముచే వ్యయముచేఁ బయనంబుచేతఁ దా
నెంద సంతాపంబుఁ జెందువాని
బపరంబులోపలఁ బాటిపోయినవాని
మూర్ఖుని భయమున మునుఁగువానిఁ
బడుచువానిని ధర్మపరుఁడైనవానిని
నతివలయందు ముందైనవాని

గీ॥ చెడుగువానిని నేస్తంబుచేయువాని
మంచిమతిగల్గువాని సాధించవలయు
మంచిమాటలచేత లాలించి యెల్ల
వారిఁ దనవారిగాఁ జేయవలయుఁ బతికి ॥ 118

కం॥ పలుతెఱఁగుల కార్యములకు
నిలలో సాధకములైన యిట్టియుపాయ
మ్ములలో సామమె పేశలు
దెలియుచు నొనరింపవలయు ధీమంతులకున్ 119

వ॥ దాన ప్రకరణమ్ము. 120

సీ॥ అధికంబు మధ్యమం బల్పంబుగా ధన
మిచ్చినట్లనె మఱి యిచ్చుటయును
ఉనసామ్యమెవ్వియుఁ దానియ్యకయె మున్నె
కైకొన్న సమ్మతిఁగని యలరుట
యటుమలై మించినయట్టి పదార్థంబు
లింపు మీఱంగఁ దా నిచ్చుటయును
దా నప్పు లిచ్చిన ధనములు దక్కఁగా
నప్పణబెట్టి తా నప్పగించు

గీ॥ టన్యులధనంబుఁ గైకొన నడరెనేని
యందులకు సమ్మతించి సహాయుఁడగుట
యిట్టు లైదువిధంబుల నెనయుదాన
రీతు లెఱుఁగంగవలయును నృపవరుండు॥ 121

కం॥ ఘూనాథుఁడు లోభముగల
వానిన్ మఱి పేదయైనవాని నెఱుఁగుచున్
దానోపాయముచేతనె
తా నెంతయు వశులఁజేయఁ దగు నెచ్చోటన్॥ 122

కం॥ దానవగురుఁ డింద్రునిచే
దానంబున శాంతిఁజెందె ధర నటుగానన్
దానముననె కలహంబులు
మానుపఁగావలయు బుద్ధిమంతుల కెల్లన్॥ 123

కం॥ తనయాడుబిడ్డకును ద
ప్పొనరించినఁ జూచి కోప మొదవినశుక్రున్
మును వృషపర్వుఁడు దానం
బున మాన్చెర గాన నదియె ముఖ్యం బెందున్॥ 24

కం॥ కలహము మాన్పెడుకొఱకై
బలియున కీపలయుఁ బ్రియముఁ బల్కుచున్నా
నలదుర్యోధనుఁ డీయక
చలమునఁ గులమెల్లఁగూల్చి నశియించె దానుఁ॥ 125

కం॥ జనపతి దానోపాయము
మునుగా సామంబు భేదమును గావింపం
జను దానముచేతను మిం
చినసామము భేద మర్థసిద్ధిం జేయుఁ॥ 126

ఆ॥వె॥ తృణముపోలె నీవి నెసఁగనిసామంబు
గార్యసిద్ధిచేయఁగాన దెందు
నీవి చూపఁడేని యిల్లాలు దనకైన
రిత్తమంచిమాట బత్తిగనునె॥ 127

వ॥ భేదోపాయప్రకరణము. 128

కం॥ అనురాగంబును నెయ్యం
బును జెఱుచుట చాలఁగినుకఁ బుట్టించుట జం
కెన చూపి తలఁక చేయుట
యన భేదము మూఁడుదెఱఁగులై చెలువొందుఁ॥ 129

వ॥ భేదోపాయప్రయోగము. 130

కం॥ తనువాని కమ్మకొనుగతిఁ
దననేర్పులు చాల మెఱసి తా హితచర్యం
దనరుచు నరి భేదింపం
జనుఁ జల్లనయైన నీళ్ళకై లమ్ముఁబోలెఁ॥ 131

కం॥ తమవారు శత్రుచే భే
దము నొందక యుండఁ జేసి తా శత్రుల భే
దముఁ జెందఁ జేయవలయుఁ
సమకొని తమపక్షమునకు శాంతి ఘటిల్లఁ॥ 132

కం॥ జననాథుండు పురోహిత
జనులను మంత్రుల నమాత్యజనులను యువరా
జును భేదింపం జను ని
ట్లనుపుగ భేధించెనేని యరి నెపు నెంచున్ ॥ 133

కం॥ జననాథమణికి మంత్రియ
తనుఁగవ యువరా జమాత్యగణములు భుజముల్
గన వీరలయం దొకఁడై
నను భేదముఁజెంద రిపుఁడు నాశముఁ జెందున్ ॥ 134

కం॥ మును బయిదెఱఁగుల నడకల
దెనుపొందినవైరికులజు భేదింపంగాఁ,
జను భేద మొంది యాతఁడు
తనవెలపును దానె చెఱుచు దావాగ్నిగతిన్ ॥ 135

కం॥ తనశత్రునిదాయాదినిఁ
దనశత్రునిచనపరియును దగ నమ లిటు వీ
రిని భేదింపన్ వలయును
దనయందును భేద మొందు తగులకయుండన్ ॥ 136

చం॥ చనవున మించి శత్రునెడఁ జాలఁగఁగోపము రేఁచమాన్ప నో
పినఁజను భేదముంబఱచి పెంపెసఁగం దెలియంగ నొప్పు స
జ్జనుఁడును దుర్జనుం డగుట సజ్జనుఁడైనను బూనుకార్యముల్
దనరఁగఁజేయు దుర్జనుఁడు దా ధనకాంక్షలుఁగూల్చు నిర్వరన్॥

చం॥ జనవిభుఁడప్పు డించుక యొసంగుచు నాశలు చాలఁ జూపుచున్
దనరఁగ నిందు నందును ఘనంబుగ జీతముఁ జెందువారిచే
ననువునఁజొచ్చినట్టిఱఁగులై తగుభేద్యుల నెల్లభేదముం
గన నొనరింపఁగావలయుఁ గాలము దేశముఁ దా నెఱుంగుచున్॥

వ॥ ఇట్టినాలుగుదెఱంగుల భేద్యులెట్టివా రన్నను ప్రభునిచేత జీతంబులు చెందని లుబ్ధుండును, నవమానంబు చెందిన యభిమానియు, వెఱపింపఁబడిన భీతుండును, గోపింపఁబడిన క్రుద్ధుండును, ననంబరఁగుచుండుదురు. తత్ప్రకారంబు క్రమంబున వివరించెద.

సీ॥ అశనములఁబెట్టింప నరుగుచుండెడువాఁడు
మిగులంగఁ బేదయై నొగులువాఁడు
పతిచేతఁ జెఱుపఁగాఁబడిన ధర్మంబును
గామంబు నర్థంబు గలుగనివాఁడు
వెలుపట సౌఖ్యంబు గలిగినవాఁడును
నధికభోగముఁగోరునట్టి వాఁడు
వసుధ నెంచఁగ లుబ్ధవర్గమై చనరుదు
రిట్టివారల మార్గ మెల్ల నెఱిఁగి
గీ॥ యర్థములయందు మిగులఁగ నాశఁగొల్పి
మఱియు నందుకుఁ దగినట్టి మాట లాడి
భేద మొందించవలయును బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 140

వ॥ అభిమాని ప్రకారంబు. 141

సీ॥ కలహంబుపైఁ గాంక్ష గలిగియుండెడువాఁడు
సాహసవృత్తి నెసంగువాఁడు
ధనముచేఁ గులముచేఁ దనకు నీడైనవాఁ
డెంచ లేఁడంచు గర్వించువాఁడు
పూజార్హుఁడై యుండి పూజనొందని వాఁడు
నేపాటిమాటైన నెడయువాఁడు
సరిగానివానితోఁ సాటిచేసినఁ గోప
మంది సమర్థుఁడై నట్టివాఁడు

గీ॥ పసుధలో వీరి నభిమాని వర్గ మంద్రు
క్రమముతోడుత వీరిమార్గంబు లెఱిఁగి
ఖేద మొందించవలయును బెంపుఁజూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 142

వ॥ భీతవర్గ ప్రకారంబు. 143

సీ॥ పరితోడఁ గోపించి పగఁబెట్టుకొనువాఁడు
పిఱికితనంబున బెగడువాఁడు
పతిచేతఁ గోపింపఁబడియుండువాఁ డెండ
నతనిదాయాది యైనట్టివాఁడు
తా నేరములు సేసి తలఁకుచుండెడివాఁడు
గ్రడునగ్గి ప్రియమాడఁ బడినవాఁడు
వెలివేయఁగాఁబడి వెతలఁ జెందినవాఁడు
గణుతింప భీతవర్గం బటంద్రు

గీ॥ పీరిమార్గంబు లెఱిఁగి వివేకి యగుచు
పుటియు నందుకుఁ దగినట్టిమాట లాడి
ఖేద మందించవలయును బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 144

వ॥ క్రుద్ధవర్గ ప్రకారము. 145

సీ॥ ఇయ్యంగఁదగు నర్థ మియ్యక యొంతయుఁ
గాలంబు గడపఁగాఁ గడఁగునతఁడు
నవమాన మొందిన యభిమాని యగువాఁడు
లేనినిందలకు లోనైనవాఁడుఁ

గానుపడై యరికట్టఁగాఁ బడువాఁడుఁ
తన బంధువుల నొంపఁగనియువాఁడుఁ
గారణంబేమియుఁ గలుగక ధారుణీ
పతిచేత విడువఁగాఁ బడినవాఁడు

గీ॥ వసుధలో నెంచఁగాఁ గ్రుద్ధవర్గ మగుదు
రిట్టివారికిఁ గోపంబు రెచ్చఁజేసి
భేద మొందింపవలయును బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 146

సీ॥ ఆదాయమునకునై వ్యవహారమూతఁగా
గెలిపింతు నని తానె పిలువఁ బంచి
యోడించినను గోప మొందియుండెడు వాఁడు
వనితేనిపని యక్షపాటుచెంది
మనసులో నెంతయుఁ గనిసియుండెడువాఁడు
వనిగల్గి యరికట్టఁబడినవాఁడు
* (భార్యాధనములఁగోల్పడ్డవాడును నాత్మ
దోషంబుచేఁ గడుదుఃఖితుఁడును)

గీ॥ వసుధలో నెంచఁగాఁ గ్రుద్ధవర్గ మగుదు
రిట్టివారలఁ గోపంబు రెచ్చఁజేసి
భేద మొనరింపఁగాఁదగుఁ బెంపుఁ జూపి
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 147

ఉ॥ ఈవరుసన్ విరోధియొక నెంతయు భేదముఁజెందఁజేసి తా
నావలవచ్చువారలకు నప్పుడ కోరిన వెల్లనిచ్చి సం
భావనసేయఁగా వలయు మన్ననతోఁ దనయట్టివారలన్
భూవరుఁ డెందు భేదమునఁ బొందక యుండ నొనర్పఁగాఁదగున్

* ([illegible])

## సప్తమాశ్వాసము

### భేదోపాయములు

కం॥ ఇచ్చుట యాశలు చూపుట
మచ్చిక మాటాడుటయును మన్నించుటయున్
హెచ్చినభయంబు చూపుట
నిచ్చలు భేదంబుసేయునేర్పులు జగతిన్ ॥ 149

కం॥ మును భేదముఁ బొరయించుచు
జనయరిసైన్యంబుమీఁద దండ మొనర్పన్
దను దానె విఱుగుచుండును
ఘనముగ పుసిపురుపు దినినకట్టియవోలెన్ ॥ 150

కం॥ బలవంతులతోఁ గలహం
బలవడ భేదమున గెలుప నగుఁ జండామ
ర్కుల భేదపఱచి దివిజులు
గెలువరె దానవుల నెల్ల క్షితి నుతియింపన్ ॥ 151

వ॥ దండోపాయ ప్రకరణము. 152

కం॥ అలమటఁబెట్టుట చంపుట
కలిగినధనమెల్ల నొడిచి కైకొనుటయుఁగా
నిల దండము మూఁడు దెఱం
గుల వెలయు నటంద్రు నీతికోవిదు లెల్లన్ ॥ 153

వ॥ అందు వధరూపంబగు దండంబు ప్రకాశంబు నప్రకాశంబన రెండు దెఱంగులై యుండు నది యెట్లన్నను. 154

కం॥ జగతిని జారులు చోరులు
నగువారిని దనకు శత్రులగువారి మదిం
దగ నెఱిఁగి తాఁ బ్రకాశం
బగు దండ మొనర్పఁ జెల్లు నధిపతి కెందున్ ॥ 155

కం॥ జనుల వెఱపించు నతనిన్
జనులం బాధించునట్టిచనపరి నెంచన్
దను మించు శత్రుఁగూల్పఁగ
దనరుం దగ నప్రకాశదండముచేతన్ ॥ 156

గీ॥ విసము గలిపిన గండంబు లోనఁగిన్నైనఁ
దగినమారణకర్మమంత్రములనైన
విసముచేనైన నాయుధవితతినైన
నాజ్ఞసేయింపఁదగు రహస్యంబుగాఁగ ॥ 157

చం॥ పరపయి నప్రకాశమగుదండమునన్ వధియింపయోగ్యులా
నరులనుపేక్షనైన మఱిన్యాయము చంపఁగ నయ్యుపేక్షయం
దరయఁగఁదానె కట్టెదుట నప్పుడె పాయక గూఢవృత్తిచే
బరగ నొనర్పఁగాఁదగు నృపాలశిఖామణి నీతిపెంపునన్ ॥ 158

చం॥ జముఁడును బోలి మించి తనచక్కటి కేరికిఁ జేరరాక ని
త్యముఁదనయాజ్ఞ కర్హు లగునట్టిజనంబుల నాజ్ఞసేయఁగా
నపరు నుపేక్షసేయునెడ లెందు నెఱుంగనివాఁడు వోలె ఘూ
రమణవరేణ్యుఁడుండఁదగు రాజితనీతివిచారచాతురిన్ ॥ 159

కం॥ ఇల జాతిమాత్రులగు వి
ప్రులయెడలన్ ధర్మబుద్ధి పొసఁగినకడజా
తుల [1](యెడ వధంబు దండము
కలిగింపక మే)లొనర్పఁగాఁ దగుఁ బతికిన్ ॥ 160

కం॥ యమతనయుఁడు బలెఁ బతి దే
శముఁ గాలంబును సహాయసంపద యుత్సా
హము [2](గల్గి దండమున నన
యము రిపుబలమెల్లఁగూల్చు) టర్హము ధాత్రిన్ ॥ 161

1 (..............................) 2 (..............................)

కం॥ మండలనాథుల శక్తియు
తుండై భృగురాముఁ డొకఁడె తునిమినగతి భూ
మండలిఁ గలిగినశత్రుల
చెండిగ గెలువంగవలయు ధరణీపతికిన్ ॥ 162

వ॥ మఱి యందును సామదానంబులచేతను, దానభేదంబులచేతను,
భేద దండంబులచేత సాధనంబు క్రమంబున వివరించెద. 163

కం॥ నేరుపున సాధ్యులై తగు
వారపమానమున దైవవశమునఁ దనతో
[1](దూరముగ నెడసినను న
వ్వారిని సామమునఁ దాపసు వశపఱచుకొనన్) ॥ 164

వ॥ అట్టియార్యు లెట్టివారనిన. 165

కం॥ కులశీల సత్యశౌచం
బులు దానము దయయు ధర్మమును మేలెఱుఁగన్
[2](తలఁపున లోభం బనునవి
గలవారలె జగతి) నార్యగణము నుతింపన్ ॥ 166

కం॥ తనయసుజులు తనతనుజులు
తనబంధులు భేదమొంది తను నెడసినచో
టను సామదాన [3](ముల సా
ధన ముచితం బట్టి యాప్తతము లెవ్వరికన్) ॥ 167

వ॥ తనయాజ్ఞగతియంతయుం గనుంగొని తమలోనఁ దాఘెలంగుచు
భేదంబును జెందిన దుష్టులగు [4](వీరు సామాసాధ్యులు గాన
దండంబునన సాధింపనగు.) 168

1 (..........) 2 (..........) 3 (..........) 4 (..........)

కం॥ సేనాపతులను బురిఁగల
మానవులను దనదుసీమ మనుమానవులం
దా నొనగూర్పఁగ వలయును
దానమునకు భేదమునను ధరణీశుఁ డిలన్ ॥ 169

చం॥ కలఁకలు బుట్టఁజేసి తిరుగంబడియుండుకులంబువారి చెం
తల గడిసుండురాజుల వనంబుల [1](సుందెడివారి భేదపుం
జెలువున దండవై ఖరిని) చిక్కఁగఁజేయఁగ నొప్పునేపుర్
బలియఁగ నన్యులం దగునుపాయముచేఁ బను పట్టిపెట్టఁగన్ ॥

వ॥ ఇది చతురుపాయస్వరూపంబగు నింక మాయోపేక్షేంద్రజాలంబుల
ప్రకారంబులు గ్రమంబున వివరించెద. 171

మాయాప్రకారములు

సీ॥ జనులు కంబములలోనను దేవతాప్రతి
మలలోపలను జొచ్చి మెలఁగుటయును
గాంతాదిరూపముల్ గైకొనుటయు రాత్రు
లందుఁజీఁకటుల మహాద్భుతముగఁ
గౌరవిదయ్యముల బాగున మించుటయును భే
తాళుని చందంబుఁదాల్చుటయును
బులుల నక్కల యెలుఁగుల రూప మొందుట
యివి మనుజులమాయ లెంచి చూడఁ

గీ॥ గామరూపంబుఁబూను టింగలము నంప
కోలలును రాళ్ళు నీళ్ళను గురియుటయును
గాలి గట్లును మొగిలు చీకట్లు గలుగఁ
జేయుచుండుట దేవతామాయ యగును ॥ 172

[1] [..................]

గీ॥ పడఁతిరూపున మును సహ్యాబలునిఁ జంపె
మహిని భీముండు మానవమాయచేత
నలుఁడు ప్రచ్ఛన్నరూపుఁడై కొలిచె దేవ
మాయఁగైకొని ఋతుపర్ణమనుజవిభుని ॥ 173

గీ॥ అపని నన్యాయమును బోరువ్యసనములును
నడరుచుండఁ బ్రవర్తించు నట్టివాని
నరసి మాన్పక యుండిన నగు నుపేక్ష
యిదియు మూఁడు దెఱంగులై యిటుల వెలయు ॥ 174

సీ॥ కామాంధుఁడై ముందు గానక గర్వించి
ద్రౌపదిపై కాంక్ష దనరుసింహ
బలుని భీముఁడు రేయి పట్టి వధింపుచో
విరటుఁ డుపేక్షించి విడుచుటయును
మునుపు హిడింబుఁ దా మోహించి భీముని
వరియించి యతనిపై వాంఛఁజేసి
తనతోడఁబుట్టిన దనుజు హిడింబుని
నురక యుపేక్షించి యుండుటయును

గీ॥ ననఁగ నీగతి నన్యాయమైన యెడల
వ్యసనములయెడ జగడంబు వచ్చునెడల
నగు నుపేక్షింపఁ దనవారినైన నెందు
నీతిమార్గం బెఱిగిననృపవరుండు ॥ 175

ఇంద్రజాలప్రకారము

సీ॥ ఘనముగా మాయచే గట్టులు చీఁకట్లు
వెనువాన లగ్నిఁగల్పించుటయును
దవ్వుల నున్నతధ్వజములు గలిగిన
సేనలఁ గన్పడఁ జేయుటయును

దుసకలు మొండెముల్ దుండంబులై పడి
సొరిగిన ప్యూఁకలఁ జూపుటయును
నడరి సముద్రంబు లటుమించు కై పడిఁ
బెల్లుఁగా వెల్లిఁ గల్పించుటయును

గీ॥ ననఁగఁగల యింద్రజాలంబు లద్భుతముగ
వైరిరాజులు భయ మంచవలసి నేర్పుఁ
చనర నొనరించవలయు నుదారలీల
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 176

గీ॥ దైవమాయా విలాసంబు దడవు నిలుచు
నింద్రజాల విలాసంబు లెల్ల నపుడె
గానుపించును నామీఁదఁ గానరాక
పోవు నివి దెలియందగు భూమివిభుఁడు ॥ 177

ఉ॥ నీతివిధిజ్ఞుఁడైన ధరణీపతి యీగతి నీయుపాయముల్
చాతురితోడ శత్రువులసైన్యమునందును నాత్మసైన్యమం
దాతతరీతిఁ జేయఁదగు నాగతిగాక యుపాయశూన్యుఁడై
యేతఱి నూరకున్నయెడ నెందును నంఘుఁడనంగఁ జేడ్పడున్॥

చం॥ అనలములోన నుండి తనరారుసువర్ణము బట్టుకానసం
గొని బిగఁబట్టినందునకు గొబ్బున జారక చిక్కుమాడ్కి శ
త్రునియెడ నున్నసంపదయు రూఢిమెయిందగు నీయుపాయవ
ర్తనమునఁబూనిభూవిభుఁడు దా బిగఁబట్టినఁజిక్కుఁగ్రక్కునన్॥

ఉ॥ శ్రీరఘురామపాదసరసీరుహభక్తినియుక్తమానసో
దారధరాధురావహనదక్షిణ దక్షిణబాహుదండవి
స్తారయశస్స్ఫురోవరలసన్నవనీరజకోరకాకృతి
స్ఫారసరోజజాండనయచారవిచక్షణ భద్రలక్షణా 180

కం॥ విమతహరణార్థయాత్రా
క్రమకౌశల విజయశకునగతినిర్ణయధా
గ్విమలమతి సారపటువి
క్రమ సప్తోపాయచతుర ప్రఖ్యాతజయా ॥ 181

తోటకం॥ పటుధాప్రతిభాభరణాభరణా
చటువాక్చణసజ్జనతాభినుతా
ఘటితాంచితలక్షణలక్ష్యరసో
త్కట కావ్యకళాకరణాదరణా ॥ 182

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భారద్వాజసగోత్ర జక్కరాజ యెల్లనామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు యాత్రాభియోక్తృదర్శనప్రకారంబును,స్కంధావారనివేశనిమిత్త జ్ఞానంబును, సప్తోపాయ వికల్పంబునున్నది సప్తమాశ్వాసము.



# ఆంధ్ర కామందకము

## అష్టమాశ్వాసము

కం॥ శ్రీశ్రితమందిర రఘుపతి
విశ్రుతగుణవినుతిచతుర విపులరుచియశో
మిశ్రితలోక సుధీనిక
రాశ్రయ కొండ్రాజువెంకటాద్రినరేంద్రా ॥ 1

వ॥ అవధరింపుము. 2

### సేనావివరము

ఆ॥వె॥ సామదానభేదసరణులు శాత్రవ
వరులయెడల నడపవలయు వరుస
నందుఁ జిక్కఁగానియపుడు దండోపాయ
శక్తిఁ జూపవలయు జనవిభుండు ॥ 3

చం॥ తనకుఁ బ్రసన్నభావమునఁ దారకలుం గ్రహముల్ చరింపుచో
వినయముతోడ దేవతల విప్రులఁ బూజలుసేసి సంతసం
బెనయఁగ నాఱు చందముల నెన్నికకెక్కు బలంబులం గ్రమం
బున నడపింపుచుఁ గదలి పోఁదగు భూపతి శత్రుమీఁదటన్॥ 4

### షడ్విధబలప్రకారము

సీ॥ స్థైర్యాదికమగు మూఁకకంటెను గల్మిలే
ములకు లోనగుప్రాఁతమూఁక మేలు
కూటంబుకంటె నెక్కుడు స్వామివశమైన
జీతంబుఁ జెందు స్థైర్యగాంత్రు

మిత్రసైన్యముకంటె మేలగుఁ దనసీమ
సమసుఖం బొందు కూటములమూఁక
శత్రుసైన్యముకంటె మిత్రసైన్యము మంచి
దేకార్థమతి నెయ్యమొనయుకతన

ఆ॥వె॥ మిగులఁ జెడుగు లగుచు మెలఁగి విల్కాడలేని
యడవిమూఁకకంటె నరయ మేలు
శత్రుసైన్య మిట్టిచందంబు బలముల
తారతమ్య మెఱుఁగఁ దగు విభుండు॥ 5

వ॥ అది యెట్లనినను మఱియు విభునిచేత సత్కారంబులు చెందుట, యతనియం దనురాగంబు గలిగియుండుట, సహాలాపంబులు గలిగి వర్తించుట, బహుకాలంబుననుండి యతనితోడంగూడి కలిమిలేములకు సుఖదుఃఖంబులకు లోనైనవారగుటం జేసి ప్రాఁతవారలు కైజీతంబుమూఁకలకంటెను మేలు. ఆసన్నవర్తులై యుండుచుఁ జెప్పినపని జెప్పినట్ల నేయుచుండుకతనను తమ జీవనంబులు భూవిభునియధీనంబులగుటం జేసి కైజీతంపు మూఁక కూటపుమూఁక కంటెనుమేలు. సమంబుగా సంతోష రోషంబులం జెందుట విభునకు సుఖంబుగలిగినం దామును సుఖవృత్తిఁజెందుట, యతనిదేశంబుననే నిచ్చలు మెలంగుటం జేసి కూటపుమూఁకలు మిత్రబలంబుకంటెనుమేలు. సమంబుగా దేశకాలంబుల నొనఁగూడి వర్తించుట, యిరువురు నేకప్రయోజనంబున నాసక్తిమెలంగుట, పరస్పర స్నేహంబు గలుగుటం జేసి శత్రుబలంబుకంటె మిత్రబలంబు మేలు. స్వభావంబున ధర్మపరులై పరధనంబులయందె లోభంబుగలవారై దుర్జనులై మాటపట్టుఁదప్పెడివారలైన యడవిమూఁకలకంటెను దను గొల్చు శత్రుబలంబులె మేలిదియునుం గాక. 6

సీ॥ అరిబలంబులు మఱి యాటవికులు విభు
సీమఁ దా మెప్పుడు జెఱుతు మంచు
సదను గోరుకయుండునట్టివారగుటను
దండయాత్రలు గల్గుతఱిని దెలిసి
తనవెంట వీరిఁ దోడ్కొని పోవఁగాఁదగు
నటులఁగాకున్న రాజ్యంబు నెల్ల
జెఱుపుచుండుదు రందుచే శత్రువులకును
జయము నిశ్చయ మెట్టి సరవినైన

గీ॥ నదియుఁగాకున్నచో భేదమైనఁ గలుగుఁ
గావునను దండయాత్రలు గదలు నపుడు
వారివెంటనె తోడుకపోవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 7

వ॥ ఇట్టి షడ్విధబలంబుల చందంబు లెఱింగి దండు గదలునప్పుడు విభుండు దనవెంటనే తోడుకపోవువిధం బెట్లనినను దత్ప్రకారంబు క్రమంబున వివరించెద. 8

సీ॥ వ్యయమును దడవును క్షయమును గలయాత్ర
తనమూలబలముతోఁ జనగవలయుఁ
దడవును నాశంబుఁ దగులనియదియైనఁ
గైజీతములతోడఁ గదలవలయు
నరిమూఁకఁ గడుఁగొంచెమై తడ వందని
యెడఁ గూటములతోడ నెత్తవలయుఁ
దనకులోనై ఫలం బొనగూర్చుమిత్రుతో
సమకార్యములయందె చనఁగవలయు

గీ॥ దుర్గములచెంతఁ గంటకాదులకు నెదుర
శత్రుబలములు మున్నుగాఁ జనగవలయు

సరులఘూములఁ జొచ్చుచో నడవులందు
నాటవికసేనతోఁ జన నర్హ మంత్రు ॥ 9

వ॥ ప్రాంతమూఁకలకు. 10

సీ॥ కడుచేవ యనురక్తి గలిగిన ప్రాంతమూఁ
కలఁజెంది శత్రుండు బలిసి యున్న
నతనికి సమబలంబై యుండునట్లుగా
క్షయము వ్యయంబును జాల నోర్చు
ప్రాంతమూఁకలఁగూడి పైనెత్తఁగాఁ దగుఁ
గడుదూరమగుఁ ద్రోవగలదియైన
డడపువట్టెడు నట్టిదండైనఁ దనచేత
బహుమాన మొందినప్రాంతమూఁక

గీ॥ లిలఁ గడలజెంది యాజికి నిలుచుఁగాన
ప్రాంతమూఁకలె ఘనమైనబలముతోడ
వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 11

సీ॥ తడవు వట్టెడునట్టి దండైన మిగులంగ
దండఁగల్గినయట్టిదండునందు
బలములు బహువిధంబుల నుండు కతమున
వ్యయము క్షయం బోర్వనట్టి కతన
గమనప్రయాసము గల్గినకతమునఁ
దనప్రాంతమూఁకలు దక్క నితర
బలములయం దెల్లఁ గలుగును భేదంబు
లటుగాన నిట్టిచో నన్యమైన

గీ॥ బలము నమ్మక నమ్మిక గలిగి కల్గి
బలిసి వర్తించు ప్రాంతమూఁకలనె కూడి

వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 12

సీ॥ కదనంబులకు నోర్చుకైజీతపుగుమూఁక
ఘనముగాఁ దనకును గలిగెనేని
తనప్రాఁత మూఁక లెంతయుఁ గొంచెమై బలిమి
కొనఁగూడఁగా లేక యుండెనేని
పగతు మూలబలంబు మిగులంగఁ గొంచెమై
చేవయు బలిమియుఁ జెందరేని
యతనిచేఁ గైజీత మందెడి మూఁకయు
నల్పమై యనురాగ మందెనేని

గీ॥ చాలఁ గల్గియు నని సేయఁ జాలదేని
యపుడు కైజీతమొందు సైన్యంబుఁగూడి
వైరి మీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రా విధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 13

సీ॥ కడుఁదడవందక కనుపట్టు దండైన
నరయ దూరముగాని యట్టిదైన
నెవ్వేళ నమ్మిక నెనసి చేకూడుచుఁ
దనమూఁక భేదంబుఁ గనకయున్న
నసమర్థభావంబు నందుచు నరిరాజు
దన కెందు లోకువై దనరియున్న
నప్రయాసమున మంత్రాజులచే గెల్వ
దనకుఁ గల్గెడు లీలఁ దనరియున్న

గీ॥ క్షయము వ్యయమును మిగులంగఁ గలుగదేని
యపుడు కైజీతమైన సైన్యంబుతోడ

వైరిమీఁదట దండెత్తవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 14

వ॥ కూటపుమూఁకలకు. 15

సీ॥ కడు నధికంబుగాఁ గలిగిన యదియైనఁ
దనవెంటఁ దొడుకపో నౌనదెనేని
చెలఁగుచు బడలికల్ చెందని యదియైన
బహుముఖంబులుగాక పరగియున్న
చేరువదండైన చేకొద్దియై కార్య
ప్రయాసంబున నగుచునున్న
శత్రుఁడు కొంచెపుసైన్యంబుతో నున్న
నేమరుపాటున నెనఁగియున్న

గీ॥ నెట్టిచోటున మోసంబు నెనయకుండు
జాడఁ గూటపు మూఁకలతోడఁగూడి
వైరిమూఁకల దండెత్త వలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 16

వ॥ మిత్రసైన్యమునకు 17

సీ॥ తనమిత్రసైన్యంబు ఘనమైనయదియైన
ననికిఁ దెచ్చుటకుఁ దా నర్హమైనఁ
దడవుగాకుండెడి దండైనమాత్రంబు
వలననే దాడియుఁ గలహములును
దఱచుగా గలుగక తనకుఁ జేకూడిన
కార్యంబు సమమైనఁ గలుగు ఫలము
మిత్రునధీనమై మెఱసి చేరెడిదైన
వరసీమ చెఱిపెడు నట్టిదైనఁ

గీ॥ బగఱచేతను గానుకల్ పట్టి మున్ను
నట్టిపైనను మిత్రసైన్యంబుఁ గూడి
వైరిమీఁదట దండెత్తవలయు నెంచు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 18

సీ॥ కుక్కఁద్రొప్పునఁ బందిద్రొప్పఁ గోరెడు బోయ
వెసఁగుక్కఁ బందిపై విడిచినట్లు
తనుఁగొల్వవచ్చు శాత్రవులసైన్యంబులఁ
బగవారిపైఁ బోరఁ బంపవలయు
నదిగాక వారు బాహ్యంబైన కోపంబు
సేసినచోఁ దనచేరువలనె
నిలుపఁగాఁ దగుఁ జెంత నిలిచిన నాంతర
కోపంబు బుట్టింప గుట్టు దెలిసి

తే॥ యపుడు గనుమలలోపల నడవులందు
గలుగునల కంటకాదుల గదుమఁ బనిచి
వారిచేతనె నొప్పించవలయు నెందు
దండయాత్రావిధిజ్ఞుఁడౌ ధరణివిభుఁడు ॥ 19

కం॥ కనుమలఁ గంటకతతులం
బనివడి శోధించునపుడు బరసీమలకుం
జనునప్పు డడవిమూఁకను
దనసేనకు మునుపె వనుపఁ దగు జనపతికిన్ ॥ 20

వ॥ ఇట్లు చెప్పిన షడ్విధబలంబులును రథగజతురగ పదాతులతోడం గూడఁ బ్రత్యేకంబులుగాఁ జతురంగబలంబు లగుచునుండు. కలనసన్నాహంబుల విధియు కోశమంత్రంబులతోడంగూడి షడంగంబు లనం బరగుచునుండు. నిట్టిబలంబుల చందంబు

విన్నియు మనంబున నిశ్చయింపుచు వైరియోధప్రతికిం దగినట్లు ప్రతివ్యూహంబులు గల్పించు విజిగీషువైనరాజు దండయాత్ర గదలందగు నందు. 21

కం॥ బలముల సేనాపతియును
తెలు పలరగఁ జేయుపనులు జేయని పనులుం
దెలియం దగు వారలకుం
గల సన్నాహంబు లెఱుఁగఁగాఁ దగుఁ బతికిన్ ॥ 22

వ॥ దళవాయికి. 23

సేనాపతి ప్రభావము

సీ॥ కులజుఁడై తనసీమ నెళపరియై తగి
మంత్రిసమ్మతుఁడునై మంత్ర మెఱిఁగి
దండనీతి యొకింతఁ దప్పక యుండంగఁ
జదివి ప్రయోగించుచంద మెఱిఁగి
నిజము సత్త్వము నోర్పు నిలుకడయును గల్గి
మాధుర్యగుణగణమహిమఁ జెంది,
తనరుప్రభావ ముత్సాహసంపదఁగల్గి
తనుగొల్చువారి కాధార మగుచు

గీ॥ నెండు నధికుల మిత్రుల పొందుఁ గల్గి
చాల దాయాదులును బంధుజనులు గల్గి
యన్నివ్యవహారములు నేర్చి యెన్నఁగలుగు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 24

సీ॥ రాజ్యాంగములకుఁ బురంబువారలకును
సమ్మతుండై మించి చాలఁ జదివి
కారణంబులు లేని కలహంబులకుఁ బోక
కలఁగక ... ... దనుచు

నెందును మోసంబుఁ జెందక శూరుఁడై
వ్యాధులఁ బొరయక త్యాగియగుచు
కడుమంచిపనిఁబూనఁ గలిగి కాల మెఱింగి
సజ్జను లెల్లను జాల మెచ్చ

గీ॥ విక్రమముచేత నెంతయు వినుతికెక్కి
బడలికల గెల్చి తేరుల భద్రకరుల
నశ్వముల నెక్కునేర్పుల నలరి మించు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 25

సీ॥ మల్లయుద్ధములందు మఱికైదువులఁజేయు
జగడంబులందును జడుపు లేక
కడువేగదాఁటి పైఁబడెడు పీఁక లెఱింగి
బవరంపునేల లేర్పఱుప నేర్చి
సింహవిక్రమమునఁ జెలఁగి యాలస్యంపుఁ
బనివాఁడుఁగాక కోపంబుఁగలిగి
జాడ్యంబు నొందక చాల నుద్ధతి లేక
యెపుడు జనాంతరం బెఱుఁగ నేర్చి

గీ॥ కరితురగరథచయములఁ గైదువులను
గలుగు లక్షణములు లెస్సఁగా నెఱింగి
చక్కదనమునఁ జెలువొందు చతురుఁడైన
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 26

సీ॥ మే లెఱుంగఁగ నేర్చి చాలంగ దయఁగల్గి
నేర్పరులను గూడి నేర్పుఁ జెంది
జోదులు ధరియించు జోక లెల్ల నెఱింగి
యన్ని యుద్ధమ్ముల యను వెఱింగి

జగడంపు సవరణచందంబు లెఱుఁగుచుఁ
గరులచిత్తంబులు నరులమనసు
హయములహృదయంబు లసువొంద నెఱుఁగుచు
వానిగుర్తులఁ బేరువరుస నెఱిఁగి

॥ వానిబనిగొనుపేర్పులు దా నెఱింగి
సకలదేశస్వభావముల్ సకలరిపులు
సకలభాషల నెఱుఁగుచు సరసుఁడైన
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 27

సీ॥ మఱుపును వెఱపును మది నెఱుంగక రేయిఁ
జరియింపఁగా నేర్చి శకునగతుల
సరవులు దెలిసి నక్షత్రగ్రహంబుల
యస్తమయం బుదయంబు నెఱిఁగి
దిక్కులు దేశముల్ దెఱువులు నెఱుఁగుచు
వాని నెఱింగిన వారి నేలి
యధికభయార్తుల కభయంబు లిచ్చి
గాలికి వాన కాఁకలికి నోర్చి

గీ॥ దప్పిదగలకు నెండకుఁ దాళఁగలిగి
మిగుల దూరంబు పయనముల్ మెలఁగ నొప్పి
పరులమూఁకలఁ జీకాకు పఱుప నేర్చు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 28

సీ॥ కడు నసాధ్యంబులై కనుపట్టు పనులైన
సాధించునేర్పు నిశ్చయముఁగల్గి
తనమూఁక విఱిగిన ననికి నిల్వఁగ నేర్చి
గగ్గోలు జగడంబుగతు లెఱింగి

బలములు గావించు పను లెఱుంగఁగ నేర్చి
పరుల మాతలచర్య లరయ నేర్చి
ఘనమైనయుద్యోగ మొనరించి వేగమె
యంచు ఫలంబులఁ జెంద నేర్చి

గీ॥ పట్టి యీదేశ్చుకొనునట్టి పనులు గల్గి
యుటుల మెలఁగెడువారల సరసి నిలిపి
పరిభవంబైనయెడఁ గ్లేశపడిర యుండు
ఘనుని దళవాయిగాఁ జేయఁ జనును బతికి ॥ 2॥

ఆ॥వె॥ ఇట్టి లక్షణముల నెంతయుఁ జెలువొంది
పతిహితంబునందె భక్తి గల్గి
చెలఁగు సంపదలను జేకూర్చు ఘను దళ
వాయిఁ జేయ మెలపవలయుఁ బతికి ॥ 3॥

చం॥ ఎడయక రాత్రులుం బవలు నెచ్చరికందళవాయి యేఱులం
దడవులఁ గొండలం గడు భయంకరమైతగు దుర్గసీమఁ బ
ల్లడపడకుండునట్లుగ బలంబుల వ్యూహమొనర్చి తాన యె
క్కుడుజతనంబునన్ మెలఁగి చూడుచు నేనలఁగావఁగాఁదగున్

## ప్రయాణ వ్యసనరక్షణ ప్రకరణము

సీ॥ మేటియౌనొకదార మిక్కిలి శౌర్యంబు
గలమూఁకతో మున్నుఁ గదలవలయు
రమణీసమూహంబు రాజభండారంబు
చదలంబునడుముగాఁ జనగవలయు
వానికి రెండుపార్శ్వములందు హయములు
హయములపజ్జల నరదములును
వానిపార్శ్వంబుల నేనుగుల్ వానిపా
ర్శ్వంబుల గదియంగ పదబలంబు

గీ॥ లరుగఁబలయును వీరల కన్నిటికిని
వెనుక దళవాయి బడలినజనముఁ జేర్చి
కొనుచు నాయత్తపాటుతోఁ జనఁగఁ జేయ
వలయు దండెత్తునట్టి భూవల్లభుండు ॥ 32

సీ॥ భయము ముందర గల్గఁ బటుమకరవ్యూహ
మునకైన ఠెక్కెలు దనర విచ్చి
రహి మించునట్టి గృధ్రవ్యూహమునకైన
వీరముఖంబైన తీరుబడిన
సూచికావ్యూహంబు సూటిచేనైనను
బలముల నడిపింప వలయుఁ దెలిసి
భయము పిఱుందనౌ పట్టున శకటవ్యూ
హంబుసమతి పార్శ్వభయములందు

గీ॥ వలరు వజ్రాయుధమురీతి నన్నిదిశల
భయము గల్గిన సర్వతోభద్రరీతి
బలము వ్యూహంబుగాఁ బన్ని బలవిభుండు
నడువగాఁ జేయవలయు యత్నంబుతోడ ॥ 33

వ॥ బలప్రయాణ వ్యసనములకు. 34

సీ॥ గుహలందు నేఱులందుఁ గొండల నదిత్రోవ
నడవుల నిఱుకటమైన యెడల
బడలిన నాకొన్నఁ గడు దప్పిఁజెందినఁ
గఱవుచేఁ దెవులుచేఁ గలిగియున్న
దొంగలు మారియుఁ దోలుక తిరిగిన
నడుమ నీళ్ళను ధూళి యల్లముకొనినఁ
జెదరిన సందడిఁ జెందిన నిద్దుర
వందినయెడఁ గూడి [illegible]

గీ॥ కొంచెమైనను సవరణ గూడకున్న
గాలివానల నగ్నులఁదూలియున్నఁ
దనదు సైన్యంబు రక్షించుకొనఁగవలయు
శత్రుసైన్యంబు లటులున్న జడుపవలయు ॥ 35

గీ॥ దేశకాలవిశేషముల్ దెలిసి యరుల
బలము భేదంబు నందించి బలసి చెలఁగు
బలియునకుఁ గూటయుద్ధంబు గలుగదేని
యేయెడఁ బ్రకాశయుద్ధంబు చేయవలయు ॥ 36

కం॥ అడవులు గనుమలు మొదలగుఁ
గడు నిఱుకటమైనచోట్లఁ గళవళపడుచుం
డెడి శత్రుఁ దునుమ వలయును
విడువక గగ్గోలువడెడి వేళలయందుణ్ ॥ 37

కూటయుద్ధ ప్రకారము

సీ॥ అహితుండు పోట్లాడ ననువైనచోటుఁ దాఁ
గైకొని యచ్చోటఁ గదలకున్న
నతనిమంత్రులు మొదలయిన వారల భేద
మొందించి యచ్చోట నునికిఁ జెఱచి
యైన నాటవికసైన్యంబు పేరిటిత్రాళ్ళ
చేఁ జుట్టి పోరికిఁ జెదరఁదీసి
తనమూఁక విఱిగిన యనువున నలయించు
కొనివచ్చి యొక యిఱుకునకుఁ దెచ్చి
గీ॥ వలనెఱుఁగు వీరభటులకు సెలవుఁ బెట్టి
చేరి చుట్టుక జగడంబు చేసియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁగూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 38

సీ॥ జనపతిముందరఁ గనుపట్టుగా నిల్చి
తన కెదు రెక్కుశాత్రవునిమీఁద
వెనుకచక్కికి మేటివీరయోధుల నంపి
పొడిపించి స్రుక్కించి కెడపిమైనఁ
గాక పిఱిందిభాగంబున మొనసూపి
ముందర నలయించి మొత్తియైన
నీరటి ప్రక్కఁ దా నెదిరించి శూరుల
నవ్వలి ప్రక్కది క్కంపియైన

గీ॥ నటుల నవ్వలిపార్శ్వంబులందు మొనపి
యివ్వలికి శూరతతి నంపి యెంచియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 39

సీ॥ మునుచక్కి విషమమై మొనుపరాకుండిన
వెనుకటిదిక్కునఁ జెనకియైన
వెనుచక్కి మునుచక్కి మొనుపరాకుండినఁ
దొడరి ప్రక్కలఁజేరి పొడచియైన
నదిగాక మఱి తన యడవిమూఁకల శత్రు
బలముల దూష్యులఁ బనిచి మొదట
జగడంబు చేయించి మిగులఁ, దా బడలించి
సన్నమై కూఁతలు సడలియున్న

గీ॥ వైరితతిమీఁదఁ బడుచును వాహనములు
గలఁగఁ దనరౌతులను బంపి కడిమియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 40

సీ॥ సూష్మ్యల సరిమూఁకఁ దొలుదొల్తి నళికించి
విఱిగి రా సళికించి విఱిగి రనుచు
విశ్వాసమునఁజెంది విమతు నేమరినచోఁ
• ఏనుఁబు బల్మి చెలంగఁ దరిమియైనఁ
బాఁవంబు దిగుచోటఁ బట్టణంబులచోటఁ
బై ఁడల నూళ్ళను బ్రజలయందు
గొల్లకాసులుచూపి గొల్లలు చాలఁగాఁ
బట్టినచోఁ జుట్టు ముట్టియైన

గీ॥ వేఁటలాడంగ నడవికి వెడలి బడలి
యుండుతఱిఁ జుట్టు ముట్టి చెండియైనఁ
గూటయుద్ధంబుచే శత్రుఁగూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 11

సీ॥ మునుపుగా నొకకొద్ది మూఁకల మొనసేసి
కడు గట్టి మూఁకలకడను దాఁచ
నరిమూఁక సరకుసేయక మీఱి గర్వించి
తనమూఁకపైఁ బేర్చి యని యొసర్ప
మునుపు తాదాఁచిన మూకఁచే శత్రులఁ
జేరి చుట్టుక నొంపఁజేసి యైన
నదిగాక పగవారి యావులఁ బట్టించి
వార లందుకుఁగూయవచ్చుచోట

గీ॥ నడుమతెరువున నరికట్టి నడికియుండి
కడిమిమై చుట్టుముట్టుక పొడిచియైనఁ
గూటయుద్ధంబుచే శత్రులఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 42

సీ॥ గగ్గోలుచే భీతిగలిగి రాత్రులయందు
నిద్రఁగానక పగల్ నిద్రఁ జెంది
యులసి మేమఱినచో నదరిపాటునన్నైనఁ
బగ లెల్ల నాయత్తపాటు చెంది
బడలినచోట మాపటిజామునందైన
నపురేయిఁగడు నిద్ర దొడరువేళ
చేతిరిజగడంబు రీతి దానెఱుఁగుచుఁ
బలుజోళ్ళ కొమ్ముకత్తులును గల్గి

గీ॥ పటులచేనైన వేగంబు గలిగినట్టి
కూరతతిచేతనైనను జుట్టుముట్టి
కూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 43

సీ॥ ఎండకుగాలికి నెదురెక్కి కనుమోడ్చి
సుడిపడి తడఁబడుచోటనైన
నదిగాక క్షుద్రంబు లగునట్టియడవుల
మంచున మబ్బుల మలలఁ బొదల
వాఁగుల ప్రంతలఁ దీఁగెల గుంతల
తాల నేఱులను బోరానియిఱుకు
తెరవుల నరికట్టి తిరుగువారుచునైన
మిగులఁ దా నచ్ఛిద్రుఁ డగుచు మించి

గీ॥ యదనుఁ జేకొని పైఁబడి చదిపి యైనఁ
బదరి తనమూఁక బడలిక పడఁగనీక
కూటయుద్ధంబుచే శత్రుఁ గూల్పవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 44

గీ॥ ప్రాణములయందుఁ గడు నాసపాటు లేక
విఱిగిఁ లజ్జించి తిరిగిన వీరవరుఁడు
మొక్కలంబునఁ బైఁబడి మొత్తుఁగాన
మిగులవిఱిగినఁ దఱుమగాఁ దగదు పతికి ॥ 45

గీ॥ ఇటులఁ గపటంబు జగడంబు లెఱిగెనేని
గడు ననాయాసమున గెల్వ గల్గుచుండుఁ
గాన భూమీశుఁడగువాఁడు గపటయుద్ధ
సరణిచేతనే శత్రులఁ జమపవలయు ॥ 46

వ॥ క్షయస్థాన వృద్ధులకు. 47

కం॥ వెచ్చము న్యాయము సమమై
వచ్చిన స్థానంబు మఱియు వ్యయ మధికంబై
వచ్చిన క్షయ మం దాయమె
హెచ్చిన నది వృద్ధి దీని నెఱుఁగఁగ వలయున్ ॥ 48

మ॥ దొరయుత్సాహము గల్గి మోసగతులెందుంజెందఁగా నీక యే
సరణిన్ వైరుల గెల్చునట్లు రిపులన్ సాధింతు నన్ శంకఁదా
నిరతంబున్ మది నిల్ప చారతతిచే నేర్పున్ వగన్ శత్రులం
దరయంగాఁదగు సర్వకార్యములు నూహాపోహసన్నాహియై॥ 49

ఉ॥ మోసపుపోరిచే రిపులమూఁక నవశ్యము నొంచఁగా నగున్
వేసటలేకయుండుపృథివీపతి యీగతి శత్రు గెల్చుటల్
దోసముగాదు మున్నిటుల ద్రోణసుతుండును ద్రౌపదేయులం
గాసముఁ బూని యేఘుఱినపట్టున నొంపఁడె నిద్రవేళలన్ ॥ 50

## చతురంగబల ప్రయోజన ప్రకారము-గజకర్మ

సీ॥ దండయాత్రలను ముందరఁగాఁగ నడచుట
పనదుర్గములు చొచ్చి చనుట మఱియుఁ
దెఱువులు లేనిచోఁ దెఱువులు వెట్టుట
కొలఁకుల నదుల లోఁతులును దెలిసి
బలసమూహంబుల జలముఁ దాటించుట
యనహాయగతి జయ మందుటయును
దూరరాని మూఁకలఁ జొచ్చి భేదించుట
పేర్చి వేఁగినమూఁకఁ గూర్చికొనుట

గీ॥ పొడపుల వెలపుచూపుట పొడవులైన
కోటలును గోటవాకిళ్ళు గూల్చుటయును
చాల భండారములు మోవఁ జాలుటయును
భయము దీర్చుట గజముల పను లటంద్రు ॥ 51

## రథకర్మ

కం॥ తనసేనల రక్షించుట
యన్నిఁ జెదరినఁ గూర్చికొనుట యరిసేనలు దా
కొనియుండిన భేదించుట
యును నరికట్టుటయు రథము లొనరించుపనుల్ ॥ 52

## అశ్వకర్మ

సీ॥ కొండలదండ దిక్కుల మార్గములయందు
విమతులమూఁకల వెదకుటయును
ధాన్యాదులను మిత్రతతుల రాఁ జేయుట
వేగంపుఁబనులు గావించుటయును

బసుల వెంటాడుట తిరుగుచో పెఱుగుట
చెఱిగియుఁ గ్రమ్మఱ వెంటఁబడుట
ముసుచక్కి నడుచక్కి వెనుచక్కిఁ బ్రక్కల
పొదివి పొంకమెఱింగి పొడుచుటయును
గీ॥ వైరి యచ్చాళవై మీఱి పోర జుణిఁగి
పోయి పాళెంబుపైఁబడి పొడుచుటయును
దీసు బసవారిఁ దోడ్కొని తెచ్చుటయును
వాడిపెడలుట గుఱ్ఱపుదళముపనులు ॥ 53

పదాతికర్మ

సీ॥ ఎప్పుడుఁ గైదువులు దా మేపుఱకుండుట
త్రోవల బావుల రేవులందు
నేఱుల విడిదలయెడఁ గపటంబులు
దెలియుచుఁ దిరిగి శోధించుటయును
తృణకాష్ఠజలములు దెచ్చుచోటులయందు
మిగుల నెచ్చరికతో మెలఁగుటయును
రేలును బగలు భూపాలుఁ గాపాడుట
చెప్పిన యట్లనె చేయుటయును
గీ॥ నివియ మొదలుగఁ గలిగిన యిట్టి వెల్ల
బలము లోనరించు పను లంద్రు తెలిసి చూడ
నిటులఁ జతురంగములపను లెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగిననృపవరుండు ॥ 54

సీ॥ మంచిజాతియుఁ బరిమాణంబు వేగంబు
స్థానంబు వయసును సర్వములును
విలుకడ పనులందు నేర్పును దేశంబు
చెప్పినక్రైవడిఁ జేయుటయును

ఘనతయు భద్రలక్షణముల నాయువుఁ
గలిగి యెన్నికమీఱ మెలఁగుటయును
పెట్టింటుల నేసుఁగులకును మఱియును
గాలిపందికెని లక్షణములెందు

తె॥ నిటుల బలముల లక్షణం బెఱిఁగి యెపుడు
వాని వానికిఁ జేయఁగా వలయు పనుల
యందు నియమింపఁగాఁ దగు హరువు లెఱిఁగి
నీతిమార్గం బెఱింగినన్నృపవరుండు ॥ 55

వ॥ చతురంగ బలముల నేలలకు. 56

గీ॥ గుంటలను మిట్టలను జెట్ల గొప్పతాళ్ళఁ
బుట్టలను మోటుచెట్టులు బొదలుగల్గి
మెలఁగఁగా వచ్చి ముండులు గలుగదేని
రాలిమూఁకల పనిసేయు నేల యంద్రు ॥ 57

వాజిభూమి

కం॥ జలమును నడుసును నెఱియలు
గలుగక ఱ్ఱాకులును తాలుఁగడు లేక సమ
స్థలమై మెలఁగఁగ వచ్చుచు
నలరిన గుఱ్ఱములనేల యగు నంద్రుబుధుల్ ॥ 58

రథభూమి

సీ॥ ఇసుకలు మొద్దులు నెందెందె యుండక
బలుగుండ్లు నడుసు గుంటలును లేక
చేలును మళ్ళును జెట్లుఁ దీగలు లేక
గుంతలుఁ బొదలు వాఁగులును లేక

నెఱియలు నొడ్డులు బొఱియ లేమియు లేక
పడి దాఁట గొరినెతాఁకుడుల కోర్చి
కడుగట్టియై బండికందులు గలఁగక
చదరమై మిగుల విశాల మగుచు

గీ॥ నిగుడ మగుడంగఁ దగునట్టినేలలందు
నరదములు జగడముసేయ నమరుచుండు
నిట్టిజగడంపునేలల నెఱుఁగవలయు
నీతిమార్గం బెఱింగినసృపవరుండు ॥ 59

నాగభూమి

సీ॥ తివిచివేయఁగవచ్చుతీవియల్ గలయది
పట్టి విఱువవచ్చుచెట్టు గలది
యుసుకలు నసలును నెపఁగనియదియును
నేనల కెందు రాఁబోనియదియు
ఘనములై కనుపట్టు గట్టులు గలయది
కడు గుంట మిట్టలు గలుగునదియు
గలయంగ నుడుగు వేరులుగలయదియును
ననిసేయఁ గరులకు సర్హమైన

గీ॥ నేల యదిగాక యెటువంటి నేలయైనఁ
గరుల కగు వాని కెందు నగమ్యభూమి
గలుగకుండుట గాదె నాగంబు లయ్యె
నిట్టిభూముల నరవరుఁ డెఱుఁగవలయు ॥ 60

సీ॥ అనిమొన విఱిగినయశ్వాదిబలముల
నిలుపఁగా నోపుచు బలము లెల్ల
వెనుకదిక్కందు నిల్చిన ప్రతిగ్రహ మందు
రదియు నిన్నూఱువిండ్లంతదూరం

నలిగిన వెనుచక్కి నిలుకడగా నిల్చి
జగడంబు సేయింప జయము గల్గ
నటుపలె పేరయ యనిసేయు సేబలం
బవిను పేఁగినబలం బనఁగఁ బరగె

గీ॥ నిట్లు గాపున జగడంబు లెఱుఁగురాజు
వెనుకదిక్కునఁ దా నిల్చి విఱిగి వచ్చు
వారిఁ గడు నాదుకొని నిల్పవలయు నెంచు
వెనుక ననిలేక పోరు గావింపరాదు ॥ 61

## దానకల్పన ప్రకరణము

వ॥ కరి యూథంబుల మొనఁదఁ బెట్టుకొని వేగం బొప్పుతేజీల సం
పదయ న్నగ్గడఁ గాపుగా నిలిపి యోగ్యంబైన యస్త్రంబుతో
నరనాథుం డెట నిల్చు నచ్చటనె భండారంబును న్నిల్పఁగాఁ
బరగుణ్ రాచతికంబు నిల్పు సదిగా భండార మొందుం ధరణ్ ॥

క॥ తొలుదొలుతఁ బొడిచి గెలిచిన
భళి భళి యని పిలిచి యొసఁగఁ బతి కగు నీవుల్
గలిగిన నెవ్వఁడు బొడువఁడు
చలమునఁ బైకుఱికి శత్రుసంఘముల నిలణ్ ॥ 63

సీ॥ పోరిలోఁ బగరాజుఁ బొడిచినవానికి
దాక్షిణ్య మొనరఁగా లక్షసంఖ్య
నతనికుమారుని నతనిసేనాపతి
నైనఁ జంపినవాని కందునగము
శత్రుసేనలలోన సమ్మతి కెక్కిన
వీరుఁ జంపినఁ బదివేలమాళ్ళు
పోటేనుఁగను గడు మేటిప్రధానుని
వనిఁ గూల్చునతనికి నయిదువేలు

గీ॥ సహితుచనవరినై నను హయమునైన
వెనుకఁ దియ్యక చంపిన వెయ్యిమాళ్ళు
బంటుతలఁగొట్టి తెచ్చిన బంటునకును
బతి యొసంగఁగఁదగు రెండు పదులమాళ్ళు ॥ 64

కం॥ పరబలముల కెదిరింపుచు
సురువడి శౌర్యంబుఁజూపు యోధుల కెందుఀ
నరవరుఁ డినుమడి జీతం
బరయుచుఁ దా నియ్యవలయు నందఱు మెచ్చఀ ॥ 65

గీ॥ ధరణినాథుల కర్హమై తగినయట్టి
కరితురంగాదివస్తువుల్ గాక యన్య
వస్తువుల నాజి గెల్చి యెవ్వార లెందు
నేమి దెచ్చినఁ బతి వారి కియ్యవలయు ॥ 66

కం॥ అనిలోన గెలిచి వచ్చిన
తనభటులకుఁ దగిన వస్తుతతి నొసఁగుచు నె
మ్మనముల సంతోషమ్ములఁ
గనఁ జేయఁగవలయు ధరణికాంతుం డెపుడుఀ ॥ 67

## వ్యూహవికల్ప ప్రకరణము

వ॥ బారులు తీర్చుటకు, 68

సీ॥ మొనకు ముందఱ విలుమూఁకల నిల్పుచో
బారులనందున వారలకును
ధనువంతనేల యంతయ నెడఁగా నిల్పి
యచటికి మూఁడు విండ్లంతనేల

*(ఒండొంటికిని నెడ నొప్పునట్టుల గుజ్జి
మల బారు నిల్పఁగావలయు దాని)
వెనుక నేనుఁగుబారులను నిల్పఁగాఁ దగు
వానికి వెనుచక్కి వరుసతోడ

గీ॥ నటుల నరదంబు బారుల నమర నిల్పి
సిరిం ధనుర్మాన మనఁగ నీ యవనిలోన
నైదు మూరలపొడవగు నది యెఱింగి
వారు లిటు తీర్పవలయు భూపాలవరుఁడు ॥ 69

సీ॥ ఇట్టి బారులలోన నెడనెడ విలుకాండ్ర
కును వాజులకు నేనుఁగులకు మఱియు
నరదంబులకును బార్శ్వాంతర భూముల
క్రమ మొప్పుచుండు నొక్కటియు మూఁడు
నైదు నైదగు సంఖ్య నమరిన శమముల
యంతదవ్వుల నిల్చి యర్థ మొందు
నట్టి శమంబును నమరఁ జతుర్దశాం
గుళసంఖ్య ధరణిలోఁ దెలిసి చూడ

గీ॥ నిన్నియును నెఱింగి బారుల నిటులఁదీర్చి
పోరగాఁదగు నిదిగాక పోరఁ దనకు
నెటులఁ బొంకంబునందడి యెసఁగ దెటులఁ
జేరువగు నెటు లటులైనఁ బోరవలయు ॥ 70

## వ్యూహరచనా ప్రకారము

వ॥ మఱియు బలంబులు దొట్రుకొనకయుండ ననేక ప్రకారంబు లెఱింగి వ్యూహంబులు బన్ని జగడంబు చేయించవలయు నవ్విధం బెట్లనిన గజానీకంబును, రథానీకంబును, మిశ్రానీకంబు

* [....................]

నన ననీకంబులు మూఁడు దెఱంగులై యుండు నందు గజంబులు
తొమ్మిదియును, నందొక్క గజంబునకు ముందర జగడంబు
సేయు గుఱ్ఱంబు లేనింటిచొప్పున నలుపదియైదు గుఱ్ఱంబులును
నందొక్క గుఱ్ఱంబునకు ముందర జగడంబుసేయు వీరభటులు
ముగ్గురి లెక్కను నూటముప్పదియైదుగురు వీరభటులును నిట్లు
పాదసంరక్షణార్థంబు పార్శ్వంబులయందుఁ గాచికొనియుండు
గుఱ్ఱంబులు నలుపదియైదును, వీరభటులు నూటముప్పదియైదు
గురునుం గూడి తొమ్మిది గజంబులును, దొంబది గుఱ్ఱంబులును
నిన్నూటడెబ్బది సంఖ్యగల వీరభటులునుం గలయది గజానీకం
బనం దగు, నీ ప్రకారంబునఁ దొమ్మిది రథంబులును, డొంబది
గుఱ్ఱంబులును, నిన్నూటడెబ్బది సంఖ్యగల వీరభటులునుం గల
యది రథానీకం బనం దగు. తొలుదొల్త వీరభటులును, వారల
వెనుక గుఱ్ఱంబులును వాని పిఱుందన రథంబులును, వాని
వెనుచక్కి నేనుంగులునుం గలయది మిశ్రానీకం బన నొప్పు
నిట్టి యనీకసమూహంబే వ్యూహం బనం బరగు, నదియు
దండవ్యూహంబును, భోగవ్యూహంబును, మండలవ్యూహంబును
నసంహతవ్యూహంబును నన నాలుగుదెఱంగులై యుండు.మఱియు
నేతద్భేదంబులైన వ్యూహంబు లనేకంబులు గల వది యెఱింగి
వ్యూహంబులు పన్నునపు డనీకానీకమధ్యంబున నైదేసి విండ్లంత
దవ్వుగలుగఁ బన్నవలయు, నం దసంహృతవ్యూహంబున
ననీకంబులు దూరంబున నిల్చునట్లుగాఁ బన్నవలయు, నిట్టి
వ్యూహంబునకు శుక్రమతంబువార లురోభాగం బొకండును
బార్శ్వభాగంబులు రెండును, మధ్యపుచ్ఛభాగంబులు రెండునుం
గూడి పంచాంగంబులుంగలవందురందునకుఁ దనకుంగల బలంబు
మూఁడుపాళ్ళుగ నేర్పఱచి యురోభాగంబున నొకపాలును,
బార్శ్వభాగంబుల నొకపాలును, మధ్యపుచ్ఛభాగంబుల నొక

సాయుధుంగా నిలుపవలయునండ్రు. మఱియుఁ గొన్నిమతంబుల వారలీ పంచాంగవ్యూహంబునందే యంగంబున కొక్కొక్క యనీకంబు లెక్క ననీకంబులై దింటికి ముందర జగడంబు సేయు వారలాయుధపాటవమువ్వదియైదుగురు వీరభటులును, నిన్నూట యిరువదియైదు గుఱ్ఱంబులును, నలువదియైదేనుంగులును నిట్టిరెపాదసంరక్షకార్థబలంబునుంగూడి వేయినిన్నూట యేబదిసంఖ్య గల వీరభటులును, నన్నూటయేబది గుఱ్ఱంబులును, దొంబది యేనుంగులునుం గలిగి యుండవలయు నండ్రు. వెండియు బృహస్పతిమతంబు వారలీ పంచాంగవ్యూహంబునందే రక్షభాగం బులు లెంచుసుంగూడి సప్తాంగంబులం బ్రశస్తిల్లుసంపురందునకుం గల బలంబు నాలుగుపాళ్ళొనరించి యురోభాగంబుల నొకపాలును, గక్షిభాగంబుల నొకపాలును, పార్శ్వభాగంబుల నొకపాలును, మధ్యపుచ్ఛభాగంబుల నొకపాలునుంగాఁ బన్ని జగడంబు సేయించవలయు నండ్రందు. 71

సీ॥ తమలోనఁ దాము సందడిపడి కలయక
యని యొనర్పఁగఁ దగు నదియుఁ గాక
కలిసి పోరాడ సంకుల సమరం బగు
నట్టి సందడికయ్యమందు నెల్లఁ
దమయేనుఁగుల దండఁ దాఁగొని జగడంబు
సేయఁగావలయు నజేయలీలఁ
దమమూఁకమీఁద గుఱ్ఱములు పైకొన్నచో
నొండొరుల్ చెదరకయుండి పోర

గీ॥ వలయు బాణంబులును దుపాకులును విండ్ల
మూఁక ముందర నిడికొని మొనకు నడచి
యెట్టి మూఁకలు బైకొన్న నట్టిమూఁక
చేతఁ బోలింపవలయును క్షితివరుండు॥ 72

## ప్రకాశ యుద్ధ ప్రకరణము

వ॥ సేనాంగాలకుఁ బ్రత్యేకనాయకులకు,

చం॥ కులమున మించువారిఁ దమకుం దగులై తగువారిఁ బోరిలో
నలవడి తత్ప్రతిక్రియల నన్నియుఁ జేయ నెఱుంగువారిఁ గ్రే
వల దమయూఁకఁ గావఁ గలవారల నేనుఁగు లాదియైన యూఁ
కలకును వేఱువేఱ నధికారులుఁగా నియమింపఁగాఁ దగున్॥

కం॥ ఈరీతి వ్యూహములుగా
నేరుపుతోఁ బన్నినట్టి నిజబలములచే
వైరిబలంబుల్ మీఱి వి
దారింపఁగవలయుఁ గదిసి దళవాయి తగన్॥

కం॥ బలిమిగల వైరిబలముల
బల మినుమడి గలిగినట్టిబలములచేతన్
గెలువఁదగుఁ దెలిపి చూపని
బలముల నేనుఁగులఁ బఱపి పఱవఁగవలయున్॥

### గజబలప్రశంస

లయగ్రాహి॥ మెండగు శిరాలురముదండ బలుకేదెములు
నిండుకొను గుమ్మలును చండితలరాణుల్
గండమర బూనుచుఁ బ్రచండమదమత్తులగు
దండిమగ లేమఱక ఖండనములో ను
ద్దండగతి లోహమయదండములు బూనుకొని
నిండునమజోకఁదగుచుండు పరసేనం
జెండఁ జనునందుఁ గలగుండుపడ వాద్యముల
ఢిండిమ డిమండిమ డిపండిమ లెసంగన్॥

ఉ॥ ఘీంకృతిసేసె మావటీఁడు మొనగాలునఁ గేలున నంకుశంబునన్
చను బురిగొల్పఁ దొండము మదంబునఁ జూపుచు వాలమెత్తుచున్
గసుగపయుం జెవుల్ నిగుడఁగాఁ దనసేన నెఱింగి శత్రుసే
నను నురుపాడి గెల్చి నరనాథున కిచ్చెఁగదా గజం బనిన్॥ 78

ఉ॥ పేసుఁగు యున్నచోనె వసియించును శ్రీహరిరాణి సంతతం
చేసుఁగు పౌఁజుగల్గుదొర యేమిట నోటమిఁ జెందఁ డెట్టిచోఁ
గాన మదేభయూథ మధికంబుగఁ గొల్వఁగ దంతి నెక్కి సం
గ్రామముతోడి దుర్గము నృపాలకుఁ డెక్కిన యట్లు పోరిలోన్॥

చం॥ లౌడరు భయప్రదేశముల దుర్గములై పడిఁ బాఱు నేఱులన్
గడవఁగ నోడలై రణముఖంబున రాక్షసులై ప్రయాణముల్
వెడల గృహంబులై మనసు వెచ్చగఁ జూడసు గారణంబులై
కడుమద మెచ్చు నేనుఁగులె కా జయసాధనముల్ దలంపఁగన్॥

చం॥ బలిమి మదంబునుం గలుగు భద్రగజంబుల రాజు శత్రుమూఁ
కల నురుపాడి చెండుగఁ గకావికచేసి జయించు నేనుఁగుల్
బలువుగ గల్గినన్ జయము ప్రాఁతియె కావున వానిఁ బ్రోవఁగా
వలయు నృపాలశేఖరుఁ డవశ్యముఁ దా జయలక్ష్మి మించఁగన్॥

సీ॥ పొగడపువ్వులతావి పొదివి ఘుగుల్కొన
వెదజల్లు సంతతమదముఁ గల్గి
తేనెవన్నియ గల్గి దీప్తమై పొడవులై
వలుదలై పొలుచు కొమ్ములును గల్గి
దొరయుచు సమములౌ తుంటి దిక్కులుగల్గి
యొద్దికై కూడి పెన్నుద్దు లవఁగ
బెరయుచుం డెడునట్టి బృంహితస్వనములు
సమములె వట్టి యంగములుగల్గి

గీ॥ సకలశుభలక్షణంబులు చక్కఁదనము
చెలువు గంభీరగమనము గలిగినట్టి
భద్రగజముల నేలుభూపాలకుండు
సకలసంపదఁ జెలువొందు జనులు వొగడ ॥ 82

చం॥ గజములు గల్గు భూవిభుఁడు గా నొకచిక్కును గాక యెల్లెడన్
గజములు గల్గువాఁడు ధరఁ గల్గడు శాత్రవపంక్తికోటులన్
గజముల లీల సత్త్వములఁ గన్పడు బంటులఁ జాల నేర్పునన్
విజయము తేజముల్ సిరులు విశ్రుతకీర్తులు గల్గు భర్తకున్ ॥

రథబల ప్రశంస

ఉ॥ శూరతగల్గు సారథులు చొక్కపు తేజులు కింకిణీయుత
త్కారమహారవంబు బిరుదధ్వజకోటులు మించఁ బోరిలో
వైరిమనోరథంబులను వానిరథంబులఁ గూల్చి పొల్చు టల్
తేరులవారు గల్గునరదేవున కెద్ది యసాధ్యమే ధరన్ ॥ 84

అశ్వబల ప్రశంస

కం॥ ఏటికిఁ గరు లేటికి నరు
లేటికి మఱి రథచయంబు లీధరలోనన్
నీటగు జయము లొసంగెడి
ఘోటకములె చాలఁ గలఁ గువలయపతికిన్ ॥ 85

సీ॥ నిలిచెనా యడుగులోనే నిల్చి చిత్రమై
కదలెనా బాణవేగము దెరల్చి
యనినిఁ గైదువుల సాధనకావిగతిఁ బొల్చి
దాఁటెనా లేఁడిచందం బదల్చి

గమకించెనా సింహగమనంబు గమకించి
యడఁగెనా తాఁబేటియనువు మించి
చుట్టెనా వేదెంబు సుడిగాడ్పు నదలించి
బెళికెనా బేడిసబెళుకు బెళికి

గీ॥ యెడమ కుడి వాగెబాగుల నెఱఁగి తిరుగ
నిరుదెఱఁగుమోము లనఁదగి హయపు మురుపు
వెఱపు నొఱపును గడుమించు నరుదుబిరుదు
నదుటు నుదుటొందు తేజి రాజార్హమంద్రు ॥ 86

చం॥ తలఁప నవేళలన్ మిగులఁ దాఁ బగులై తగునట్టి చుట్టమై
యల రణభూమి పేరఁదగు నంబుధి దాఁటగ మేటితేఁపమై
నలరగఁ గ్రీడలన్మొలఁగు నప్పుడు దా వెలలేని రత్నమై
బెలఁగెడు గుఱ్ఱ మేహితము సేయదు నాయకుఁ డైనవానికిన్

చం॥ బలువగు కందముం బిరుదు బంగరుచాయహసించు సంపదల్
గల పరిపూర్ణదేహము విలాసముఁ జక్కఁదనంబు నోజయుం
గళలును జెల్వు తేటతెలిగన్నులు లక్షణముం జవంబునుం
గలిగిన తేజులన్ సిరులు గైకొను భూభుజుఁ డేలఁగాఁ దగున్ ॥

కం॥ ఏ నరపతి గుఱ్ఱంబుల
సేనలచే మిగులఁ బ్రబలు క్షితిలో నెపుడున్
వానిది సిరి వానిది ధర
వానిదె జయలక్ష్మి కీర్తి వానిదె సుమ్మీ ॥ 89

చం॥ ఈగతి నీతిమార్గమున నెంతయు సుస్థిరుఁడైన రాజు దా
దీగరిమన్ వహింపుచును దిగ్విజయంబును సర్వసంపదల్
భోగము గల్మియుం గలిగి భూవిభులెల్లను జేరికొల్వ న
ద్యోగము లెల్లఁ జేకుర సుఖోన్నతి రాజ్యము సేయు నెవ్వరున్ ॥

ఉ॥ శ్రీరఘురామపాదసరసీరుహభృంగదమానమానసో
దార మదారివీరవరదర్పవిమర్దన దుర్దమక్రియా
స్ఫారభుజాబలాధిక విసారిత పూరితలోక సద్యశో
హారవిహారమానితమహాకరివాజివిరాజితాంగణా ॥ 91

మంగళమహాశ్రీ ॥

శ్రీమహితధామనుత సింధుసృతభూస్థలివిశిష్టహితభాసిత గుణశ్రీ
కాముకకథాకృతినికాయకృతివర్జిత ప్రకాశిత నయాధిక జయశ్రీ
రామ హిమధామ శరరాజి సురరాజ తరురాజిత విశాలసుయశశ్శ్రీ
భూమరమణీయనిజభూజనసుఖప్రదప్రభుత్వయుతమంగళమహాశ్రీ

గద్యము :— ఇది శ్రీమన్మదనగోపాల వరప్రసాదలబ్ధ సారసారస్వత భారద్వాజసగోత్ర జక్కరాజ యెల్లనామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీరామకృష్ణభక్తివైభవభాగధేయ వేంకటనామధేయ ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు సేనావివరంబును, సేనాపతిప్రభావంబును గూటయుద్ధప్రకారంబును చతురంగబలప్రయోజనంబులును దద్భూములును వ్యసనంబులును బారితోషికంబును జతురంగబలప్రశంసయు నున్నది సర్వంబు నష్టమాశ్వాసము.

మ॥ రమణీయంబుగ శాలివాహశకవర్షంబుల్ గతంబై సహ
స్రము నేనూటను నాలునై వెలయఁగా బ్రౌఢిం దెనింగించి రా
ర మహిం దిమ్మయ వెంకటాద్రి విభుపేరన్ వేడ్కఁ గామందకీ
యము శ్రీవేంకటరామకృష్ణులు స్వభాస్వద్బంధంబునన్ రూఢిగన్॥

శ్రీ శ్రీ శ్రీ



Rathna Press, Tirupati — 1950.